# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 1 రాజమహేంద్రవరము 16-9-1978 సంచిక 22


### —* ఈ సంచికలో *—



1—10—78 సంచికలో జలదాంగన, మన ఆడవాళ్ళ నడకలు, కవితామతల్లి మొల్ల, పానుగంటివారి హాస్యరచనలు మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10—00.
అర్ధసంవత్సరమునకు రు 5—50.

విడిప్రతి 50 పై.

# కవిరత్నత్రయము

శనగన నరసింహస్వామి, ఎం. ఏ.

డా॥ అయ్యగారి నరసింహమూర్తి,
ఎం. ఏ. పిహెచ్.

ఏ సుముహూర్తమో యది మహీరమణుండల రాజరాజు వి
ద్యా సముదీర్ణతేజుఁడు సదస్సున నిన్నని నన్నపార్య ! శ్రీ
వ్యాస మునీశ్వరాభిహిత భారత సంహిత నాంధ్రభాషలో
వ్రాసి మదంకితంబున ప్రవర్తిలఁ జేయు మటంచు భక్తిమై

చేసె నానతి సభ్యులు శిరము లూపి
రధిపు నాజ్ఞాబలమొ భవదాత్మ బలమొ
పాండితీ మండిత ప్రతిభా బలంబొ
సరసవైఖరి లేఖిని సాగిపోయె.

చక్కని తెల్గు పల్కులును సంస్కృత శబ్దము లందగింపఁగా
నొక్కెడనైన కుంటువడకుండగ సాగును శైలి పాకమో
చిక్కని గోస్తనీ రసము చిందుచునుండును నీకవిత్వమం
దెక్కడఁ జూచినన్ మతిమహేంద్ర గురూ ! ప్రథమాంధ్ర సత్కవీ !

నన్నయ భట్టుగారి సదనంబునఁ బుట్టిన తెల్గుకబ్బపుం
గన్నెకు మేలి బంగరు నగల్ విరచించితి వంత కంతవా
ల్గన్నుల చూపు నేర్పి నుడికారపు సొంపులు మప్పినావు తి
క్కన్న ! సమస్త భావికవి కల్పకమా ! కవితా పితామహా !

నన్నయ్య కవనమా ! నవ శిరీషంబుల
మెత్తందనమ్మును మొత్తు శైలి
తిక్కన్న రచనమా! తియ్యందనంబుల
పొలిమేరలను జూపు పలుకు సిరులు
నన్నపార్యుండు తిక్కన్నయు జంటగా
సంధించి రా రసస్యంది గాగ
సంస్కృతాంధ్రోక్తులు సగము సగంబుగా
తూఁచి కూరిచిరె రసోచితముగ

ననుచు కోవిద వర్యులు వినుతి సేయ
భార తారణ్య శేష పర్వమును తెల్గు
వారికిని కర్ణపేయముగా రచించి
ఎఱ్ఱన కవీంద్ర! సత్కీర్తి నెనసినావు.

ఓహో ! సత్కవులార! మీరు కవనోద్యోగైక పారీణులై
వ్యాహరించిన తెన్గుభారతము భాస్వచ్చంద్రతారాంశుసం
దోహంబుల్ దశదిక్ ప్రదేశముల నుద్యోతించు నందాక ర
మ్యాహాఖండ సుధాతరంగములలో నూగించు నాంధ్రోర్వరన్.

ఔద్దేశిక నవల (Novel of Ideals) 4 :

# ఏకవీర

— డా. ఉప్పలపాటి శ్రీరామమూర్తి, ఎం. ఎ; పి హెచ్. డి.

భావ నాత్మకమయిన ప్రేమను ఇతి వృత్తంగా తీసుకొని వ్రాయబడిన నవల ఏకవీర. దీనిలోని కథ, పాత్ర చిత్రణం, కాల్పనిక వాద లక్షణాలతో సరిపోలి వున్నాయి. అంటే కాల్పనిక వాదపు ప్రేమ, వివాహం ఏకవీరలోని కథాంశపు ముఖ్య లక్షణాలుగా కనబడుతుంటాయి. 'వైవాహిక వ్యవస్థలో ప్రేమతత్వం ఇమడక పోయినందున స్త్రీ పురుషుల జీవితాల్లో చివరకు మరణం, వైరాగ్యం తలెత్తుతాయి'' అన్న అంశం నవల్లో కథానుగతికంగా బోధపడ్తుంది. సనాతన ఔత్కృష్ట్యాన్ని ప్రబోధించడం ఉద్దేశంగా నవల్లో ఏకవీర పాత్రను తీర్చి దిద్దడం జరుగుతుంది.

ఏకవీర నవలలోని కథ 'విచిత్ర కథా మంటపం'. ఈ కథామంటపానికి ఏకవీర, కుట్టాన్, మీనాక్షి, వీరభూపతి నాలుగు స్తంభాలు. ఈకథ ఒక 'విచిత్ర సంయోగం'. వివాహానికిపూర్వం ఏకవీరావీరభూపతులు, మీనాక్షి కుట్టానులు ప్రేమించుకుని వుంటారు. 'దైవఘటనం వ్యత్యస్త ఫలితమైంది', కుట్టాన్, వీరభూపతులు ప్రాణమిత్రులు. వివాహమైంతర్వాత ఏకవీరయందు కుట్టాన్ విముఖుడౌతాడు. ఏకవీర మాత్రం అతనియందు అప్పుడు సుముఖంగానే వుంటుంది. కొంతకాలానికి ఇద్దరిలో ఒండొరులయందు సన్నిహితత్వం పెరగటం మొదలవుతుంది. ఆ సాన్నిహిత్యం ఫలించే సమయానికి కుట్టాన్ రాచకార్యంపై వెళ్ళిపోవడం, తత్ఫలితంగా ఆమెలోని నిస్పృహ, ఉద్వేగ ప్రణయం, ఒకదాని తర్వాత ఒకటి ఏకవీరను వశపరచుకోవడం జరుగుతుంది. కొంతకాలానికి కుట్టాన్ ఏకవీరను కలిసి కోవాలనే తహతహతో తిరిగి రావడం— అదే సమయానికి ఒక విచిత్రమయిన పరిస్థితిలో పూర్వపు ప్రియుడైన వీరభూపతి కౌగిల్లో ఒదిగిపోయిన ఉద్వేగ ప్రణయిని ఏకవీర, లోకంనుండే విముక్తురాలవుతుంది. అలాగే వివాహానంతరం వీరభూపతి మీనాక్షియందు సుముఖత్వం వహిస్తే, ప్రియుడైన కుట్టాన్ మీదినుంచి దృష్టి మరల్చలేని మీనాక్షి భర్తయందు విముఖురాలవుతుంది. కుట్టాన్ వీరభూపతులు ప్రాణస్నేహితులన్న విషయం తెలిసికొన్న మీనాక్షి వీరభూపతిపై భర్తృప్రేమను చూపడానికి సుముఖురాలవుతుంది. అదేసయయంలో ఒక ఆకస్మిక సంఘటన జరుగుతుంది. తన ప్రేయసి ప్రాణస్నేహితుని భార్య అని తెలియని వీరభూపతి ఏకవీరను హృదయానికి హత్తుకొంటాడు. వెంటనే ఏకవీర ఉదంతం తెలియడంలో వీరభూపతి వైరాగ్యం పొందుతాడు.

ఈ కథలో ఏకవీర, వీరభూపతులలో ఒక విధమైన ధర్మపరిణామాన్ని రచయిత నిరూపిస్తున్నారు. వారు వివాహాత్పూర్వం ప్రేమికులయినప్పటికిన్నీ, వివాహానంతరం పరాధీను లయ్యారు. వారి ప్రేమలు వివాహం రూపంలో ఫలించలేదు. అయినప్పటికి దైవ సంఘటనవల్ల వారు ఒక సన్నివేశంలో భౌతిక స్పర్శ ఆనందం అనుభవిస్తారు. జాగ్రదవస్థలో యథార్థం తెలుసుకొన్న వారిద్దరిలో విపరీత పరిణామం ఏర్పడుతుంది. పర పురుషుని స్పర్శవల్ల భర్తను స్వీకరించలేక ఏకవీర వైగైనదిలో పడి ప్రాణాలు వదుల్తుంది. పరస్త్రీ (పరాధీన అయిన స్త్రీ) స్పర్శను పొందిన వీరభూపతి జీవితంలో వైరాగ్యం పొంది సన్యాసిగా మారిపోతాడు. ఈకథను ఇలా పర్యవసింప చేయడంలో విశ్వనాథవారి వైవాహిక వైశిష్ట్య దృక్పథం—పవిత్ర ప్రణయ తత్త్వం వెల్లడౌతాయి.

ఏకవీర ప్రణయ తత్త్వాన్ని కథగా మలచడంలో విశ్వనాథవారి ప్రతిభ కనిపిస్తుంది. ఆమె మానసిక స్థితిని చూపడంలో వీరు అవ్యక్తమైన (unconscious) భాగానికీ, వ్యక్తమైన (conscious) భాగానికీ సంఘర్షణను ప్రవేశపెట్టారు. '...తమ యిద్దరి నడుమ త్రుంచరానిదిగా నున్న స్వచ్ఛ ప్రేమబంధము తెలియును. ...వివాహమయిన రెండు సంవత్సరములుగా నేకవీర యాతని (వీరభూపతిని) మఱచిపోయినది. అతని స్థానమున కుట్టానునకు వసతి నిర్మించినది. కుట్టానావసతిలో నిలిచినాడు కాడు. తాను నిర్మించిన ప్రేమసౌధమునకు కుట్టాను తీసిన నిర్దయా ద్వారము నుండి తన తొల్లిటి వలపుకాడు ప్రవేశించిన మాట యేకవీర కవగతము కాలేదు. ...తన తొల్లింటి ప్రేమమూర్తి యామె కనులకు గట్టినట్లుండెను...అది యామెకు సర్వలోకముల నుండి... గుప్త పఱచుకొన్న ధనము. ఆ ధనమునకు యాథార్థ్యములేదని... యాధనము మాట మఱచిపోయినది. ధర్మముతోడి ధనము (=కుట్టాన్) నభిలషించినది. ఈ క్రొత్త ధన మామెకు స్పర్శదూర మధిగమించినది. ఈ రెండు ధనములామె కయథార్థము లైనవి. మొదలి ధనము మధుర ప్రేమ మయమైనది. రెండవ ధనము ధర్మప్రేమ మయమైనది. తనకు దూరములైన యీ రెంటిలో నేది మనస్సున నిల్పుటకు యోగ్యమైనదో ఆమెకు దెలియలేదు. తెలివికొలది రెండవ దానిని మనస్సున-

నామె నిలుపును. తనకు దెలియకుండ మొదటిది తానువచ్చి తన మనసావరించును. ఆ యావృత్తి యామెకు దెలిసి దెనియనట్లుండును.' (18 అధ్యా. పుట 115-116)

ఏకవీర వ్యక్తమయిన మనస్థితిలో యథార్థ ధర్మమయిన వివాహబంధాన్ని నిలుపుకొంటూంది. ఆమెకు తెలీకుండానే అవ్యక్తమనస్థితి ఆమెను ఆ ధర్మంనుండి ప్రేమబంధంవైపు లాగుతుంది. గుజ్జపువాళ్ళపిల్ల అమృతం 'ఆరంజే విరుంబు' (ధర్మంచేయునది) అనడం ఏకవీరలోని అవ్యక్త మనస్థితిని హెచ్చరించడం. అవ్యక్త మనస్థితిలోవున్న ప్రియుణ్ణి 'జడతావస్థ'లో తానునప్పుడు కలిసికోవడం జరుగుతుంది. మీనాక్షీ సుందరేశ్వరుల కళ్యాణ మహోత్సవం నాటి భామా కలాపం చూడటానికి ఏకవీర మీనాక్షి యింటికి వస్తుంది. ఏకవీర మనస్సులోన వ్యక్తావ్యక్త సంఘర్షణ 'కలాపం' రూపంలో ఉద్విగ్నత చెందింది. 'ఏకవీర ప్రాణములు పూర్వవుతైన యెనిమిద వస్థలు మానసికముగా ననుభవించినవి', (21 అధ్యా. పు 156.) కలాప ప్రదర్శనం ఇక్కడ ఏకవీర జీవిత పరిణామాన్ని తెల్పుతూంది. తానిదివరలో ప్రియుని గూర్చి మానసికంగా అనుభవించినవే ఆ యెనిమి దవస్థలు. జడతావస్థ ప్రదర్శన సమయానికి ఆమె మీనాక్షి ఇంట్లోకి పోతుంది. తెలియకుండా వీరభూపతి శయన మందిరంలో విశ్రాంతి తీసుకుంటుంది. కలాపంలోని వాసక సజ్జిక తానే అయింది. కలాపంలో ఏఘట్టంజరుగుతుందో ఏకవీరలో అదేఘట్టం సమానాంతరంగా జరుగుతూంది. ఆ స్థితిలో ఆమెకు 'అణువునకును రసజగత్తును దాటిన యునికి లేదు.' ఆమె మనస్సులో మీనాక్షి లేదు. తానప్పుడు ఎక్కడ వున్నదీ తెలీదు. కలాపంలో సత్యభామ ఎదుట కృష్ణుడు నిలుస్తాడు. ఏకవీర ఎదుట వీరభూపతి నిల్చుంటాడు. ఆరు సంవత్సరాల తర్వాత కలిసికొన్న ఆ ప్రేయసీ ప్రియుల మధ్య కాలం' స్తంభించింది. వీరభూపతి ఆమెను కౌగిలించుకుంటాడు. 'అతని యాకౌగిలింతలోని చల్లదనమామె రక్తములోఁ బ్రవేశించెను. ఆమెకు భూమధ్యరేఖా ప్రాంతస్థుని నుత్తరధ్రువ సమీపమున కొక్కసారి కొనిపోయిన ట్లయ్యెను... ఆమె హృదయములోని సర్వనాళములు నామహోస్పర్శసుఖ మనుభవించినవి.' (21 అధ్యా. పు 160). తా ననుభవించిన స్పర్శను జాగ్రదవస్థలో తెలిసికొన్న ఏకవీరకు సూర్యబింబం, గుజ్జపువాళ్ళపిల్ల అమృతం- మోహాలు ఎఱ్ఱటి నిప్పులు కక్కుతూన్నట్లు కన్పిస్తాయి. తన వ్యక్తమనస్థితిలోని వైవాహికధర్మం తప్పటం వల్లనే కర్మసాక్షి అయిన సూర్యభగవానుడు, ధర్మం చేయుమని హెచ్చరించేపిల్ల అమృతం, తనను కోపంతో చూస్తూన్నట్లు ఏకవీర అనుకుంటుంది. కుట్టాన్ రాకతో ఏకవీర వైగైనదివైపు పరిగెత్తుతుంది. వెంబడించిన కుట్టానుకు, వీరభూపతికీ తనకూ మధ్యవున్న ప్రేమను, దాని విచిత్ర పరిణామాన్ని వివరిస్తుంది. 'తన దేహములోనున్న ప్రతి యణువు వీరభూపతి స్పర్శ ననుభవించు చున్నదని చెప్పెను. అది యింకొక విజాతీయస్పర్శను తాళుకోలేదనెను.' (21 అధ్యా. పు185). కుట్టాన్ ఏకవీరను పరిష్వంగంలోకి తీసుకోవడం, ఆమె ప్రాణాలు వదలడం- ఒక్కసారే జరుగుతాయి. ప్రాణమిత్రుని భార్య అని తెలియక ప్రేయసి ఏకవీరను కౌగలించుకున్న వీరభూపతి, పాప పరిణామ ఫలితంగా సన్యాసి అవుతాడు. కుట్టాన్ అతని స్థితికి ఆశ్చర్యపడతాడు. మీనాక్షికి తనకూ పూర్వం వున్న ప్రేమను తెలుసుకోవడంతో వీరభూపతి సన్యాసి అయినాడని కుట్టాన్ అతనితో అంటాడు. వీరభూపతి కుట్టాన్‌పై జాలి చూపిస్తాడు.

ఇక్కడ ఏకవీరా వీరభూపతులు వ్యవస్థా ధర్మానికీ, ప్రేమ తత్త్వానికీ అతీతమయిన సనాతనధర్మానికి ప్రతినిధులు. మీనాక్షీ కుట్టానులు వ్యవస్థా ధర్మావలంబనకు ప్రతినిధులు అవుతున్నారు. ఏకవీరా వీరభూపతుల వ్యక్తిధర్మం పరిణామం చెందింది. వ్యక్తిధర్మమయిన ప్రేమకూ, లోకధర్మమయిన వివాహానికీ మధ్యవున్న సంఘర్షణ తీవ్రరూపం దాల్చటం వలన ఏకవీరా వీరభూపతులు సనాతనధర్మానుయాయు లయ్యారు. ఆ సంఘర్షణ ఫలితంగా వీరు యోగసిద్ధి పొందారు. వ్యక్తిధర్మానికీ లోకధర్మానికీ అతీతంగా (ద్వంద్వాతీతమయిన) సనాతన ధర్మం ఏకవీరకు ప్రత్యక్షమయింది. సనాతనధర్మ ఔత్కృష్ట్యాన్ని గూర్చి ఆమె ఉపన్యసిస్తుంది. ధర్మాధర్మ వివక్ష ఆమె మనస్సులోనే కల్గింది. మనస్సులో చెలరేగిన ఈ ధర్మజిజ్ఞాసకు ఏకవీర తట్టుకోలేకపోయింది. 'స్వామి కన్నులు (సుందరేశ్వరుని...)సంకల్పవికల్పములు సహస్రముఖముల విజృంభించు మనస్సునకై ప్రతీక్షించుచుండెను. ఆ సమయమున నేకవీర మనస్సున సంకల్ప వికల్పములు శత సహస్రముఖముల విజృంభించుచుండెను. ఏకవీర కన్నులు భగవంతుని కన్నులతో గలిసెను. స్వామి యా చూపువెంట నామెలోఁ బ్రవేశించెను. ఏకవీర భగవంతుని ప్రవేశభారమున తాగలేక మూర్ఛపోయినది' (22 అధ్యా. పు 165)

ఇటువంటి ఏకవీర ద్వారా సనాతన ధర్మ ఉత్కృష్టతను గూర్చి ఉపన్యసింపచేస్తారు విశ్వనాథ. రాబర్టునోబిలి అనే ఒక క్రైస్తవమత వ్యాపకుడు తత్త్వబోధక స్వామి అనే పేరు పెట్టుకొని 'పరిబోధితులు' గాని సామాన్య జనాన్ని మతాంతరులుగా మారుస్తుంటాడు. విగ్రహారాధనను వ్యతిరేకించిదూషిస్తుంటాడు. ఇతని సిద్ధాంత ప్రచారాన్ని ఏకవీర ఖండిస్తుంది. సనాతనధర్మ వైశిష్ట్యాన్ని నిలబెట్టుతుంది. 'ఏదేశమందైనను జనసామాన్యమునకు మత సారస్వతాది విషయములలో విశేషము తెలియదు. వారి కెవరేమాట చెప్పిన నదియే వేదము...బుద్ధి యెవని సొమ్ము? ... వాదమునకు బైవాదము ఎప్పుడునున్నది.తీవ్రతరవాదివచ్చి

నప్పుడు లొంగిపోవు సిద్ధాంతములు ప్రతిపాదించియేమి ? ప్రతిపాదించకయేమి ? లోకమందఱు మూఢులై ,యొక నీచమత మవలంబింతు రనుము. ఆ మత మండి యేమి ? లేక యేమి ? నే డొక వంద మంది నీ మతస్థులైరి. రేపు నీ తలదన్నిన వాని మాటచే వారు వాని మత మవలంబింతురు. ఇది వృథాప్రయాస. మహా విజ్ఞానఖని తన మోక్షము తాను సాధించుకొనును. సనాతనధర్మము యుగముల తరబడి నిలిచినది. నీమతప్రాబల్యమును బౌద్ధమత ప్రాబల్యముతో బోల్చుకొమ్ము. దానిని గోట జిమ్మినాడు శంకరుడు. ఈ దేశమున నే యితరమతమైనను నింతియే! తొలినాడు ఉత్తరమునఁ జైతన్య, మీరాబాయి ప్రభృతులు, పడమట రామదాసు, శివాజీ ప్రభృతులు, దూర్పున విద్యారణ్యులు నుదయించి శివునకుఁ బ్రీతిచేసిరి. మీరింక మీ మత మిట్లే ఘోషింతురా, మీవు దగినవారు మీవు నుదయింతురు. అవివేకులయందలి యేకదేశ ఫలితమువలన లోకవంచనముగాక బ్రహ్మప్రీతి లేదు. భగవద్గీత చదువుకొనుము. "యదా యదా హి ధర్మస్య। గ్లానిర్భవతి భారత । అభ్యుత్థాన మధర్మస్య । తదాత్మానం సృజామ్యహమ్." (22 అధ్యా. పు 168) ఏకవీర ధాటికి నోబిలి నిలువలేకపోయాడు. అతడు గతించిన నాలుగేండ్లుగా నిర్మించిన సౌధం ఆనాటితో నేలకూలింది.

తెలుగుదేశంలో ముఖ్యంగా సాహిత్యంలో పొడసూపిన హేతువాదమూ, భౌతికవాదమూ,పురాణాల అవహేళనా మున్నగునవి విశ్వనాథలో ఒక విధమైన ఆవేశాన్ని ఎలుగెత్తింపచేసినవి.పాశ్చాత్య మత ప్రభావం, హైందవమత ధర్మానికి అపవాదం అని నమ్మిన విశ్వనాథవారికి స్వమతరక్షణం పరమత ఖండనం ముఖ్యమయిన కర్తవ్యాలయ్యాయి. ఆ ఉద్దేశంతోనే ఏకవీరచేత ఇలా ఉపన్యసింపచేశారు. వైవాహిక సనాతన ధర్మప్రతిష్ఠాపనం విశ్వనాథ నవలేతివృత్తాలుగా మనకు చెలియలికట్ట, ఏకవీర నవలల్లో కన్పిస్తుంది.

చలం కాల్పనిక (వాద) దృష్టి విశ్వనాథవారి దృష్టికి వ్యతిరేకం. వైవాహిక వ్యవస్థలో చలానికి నమ్మకం లేదు. స్త్రీ స్వేచ్ఛావాదానికి పట్టం కడతాడు చలం. సనాతనధర్మ సంప్రదాయ వైశిష్ట్యాన్ని ఆరాధిస్తాడు విశ్వనాథ. చలం వ్రాసిన 'దైవమిచ్చిన భార్య' నవలేతివృత్తాన్ని దృష్టిలో పెట్టుకొని వ్యంగ్యంగా విశ్వనాథ వ్యాఖ్యానించినట్లు ఏకవీర నవల్లోని ఈ క్రింది వాక్యాలు తెలుపుతున్నాయి. '...ప్రేమించిన స్త్రీని వదలిపెట్టి బలవంతముగా నా మెడకు గట్టిన స్త్రీనా ప్రేమించవలె ! నా కర్థమగుట లేదు. ప్రేమించుట ప్రేమించకపోవుట యనునది నా స్వాధీనములో నున్నదా ? ఎవరి స్వాధీనములో నున్నది? భగవంతుని స్వాధీనములో నున్నది. ఏ భగవంతుని స్వాధీనములో నిది యున్నదో యా భగవంతుదే నా కీస్త్రీని దెచ్చి పెండ్లిచేసెను గదా! ... భగవంతుని యిచ్ఛలేనిది నా తండ్రి యెవరు చేయుటకు? ఈ స్త్రీకిని, నాకును సంబంధ మేమున్నది ? ఏమియు లేకున్నచో మే మిరువురము భార్యాభర్తలుగా జేయబడుట యెట్లు ? పూర్వజన్మలలో నే సంబధ మున్నదో!' (ఏకవీరలో కట్టాన్ స్వగతం. 10 అధ్యా. పు 67)

చలం దైవమిచ్చిన భార్యకూ విశ్వనాథ దైవమిచ్చిన భార్యకూ మధ్యఉన్న భేదం, రాధాకృష్ణ ప్రేమతత్త్వానికీ, కట్టాన్ ప్రేమతత్త్వానికీ మధ్య మనకు కనబడుతుంది. చలం దైవమిచ్చిన భార్య నవల్లో ప్రేమకూ వివాహానికీ పొత్తుకుదరదంటాడు. 'ఎవ రేమనుకున్నా సరే ఎన్ని బాధలూ బీదతనమూ కలిగినా సరే ప్రేమ కోసం బంధువులనీ, సంఘాన్నీ వొదలడానికి సిద్ధంగా వున్నాను. ప్రేమగల పద్మావతి మాత్రం వొదలడానికి జంకుతుందా ? అందరు పిరికివాళ్ళమల్లే లోకానికి వెరిచి, ప్రేమను పోగొట్టుకుంటామా మేముకూడా?' (దైవమిచ్చిన భార్య - 3 భాగం. పు 43) 'ఏకవీర' లోని కట్టాన్ తండ్రిలో, అంతకంటే భగవంతునిలో విశ్వాసం వుంచుతాడు. వైవాహిక బంధాన్ని గౌరవిస్తున్నాడు. వివాహం ఆజన్మ బంధంగా, భగవత్ప్రసాదంగా తలుస్తున్నాడు. 'దైవమిచ్చిన భార్య' లోని రాధాకృష్ణ పరాయివాని భార్య అయిన పద్మావతిని ప్రేమిస్తున్నాడు. పైగా తన ప్రేమకోసం సంఘాన్ని తిరస్కరిస్తున్నాడు. సంప్రదాయాన్ని అధిక్షేపిస్తున్నాడు. ఎలాగయినా సరే ప్రేమను పొందడమే ఇతని ఉద్దేశం. పై విధంగా రాధాకృష్ణ కట్టాన్ పాత్రలు చలం విశ్వనాథల భిన్నదృక్పథాలను ప్రతిబింబిస్తున్నవి. కాల్పనికవాద నవలాసాహిత్యంలో చలం విశ్వనాథలు-రెండు భిన్న మార్గాలని ప్రవేశపెట్టి ఆధునిక తెలుగు నవలా పరిణామంలో ఈ రెండు మార్గాలకీ మూలపురుషు లయినారు. వీరి ఒరవడిలోనే ఆధునిక నవలాసాహిత్యం ఎక్కువ భాగం నడిచింది. వీ రిద్దరివీ రెండు వేగమయిన ప్రవాహాలు. వీరి ప్రవాహ ప్రభావం తప్పించుకుని నిలిచిన నవలలు చాల అరుదు అనే చెప్పాలి. తెలుగు నవలా సాహిత్యంపై చలం విశ్వనాథల ప్రభావం అంతటిది !

ఈ ఔద్దేశిక నవల (novel of ideals) వ్రాయడంలో నాకు తోడ్పడిన గ్రంథములు: (Bibliography)

1. ఆర్. యస్. సుదర్శనం : సాహిత్యంలో దృక్పథాలు.
2. Floyd, L. Ruch : Psychology and life.
3. Robert Liddell : Treatise on the Novel.
4. Uzzel, T. H. : The Technique of the Novel.

— ... —

# కన్నీటి కావ్యంలో కదిలించే ప్రకృతి

– డా. జి. బి. ఎన్. ఆచార్య, ఎం. ఏ. పిహెచ్. డి.

పరంపరాగతమైన పరిజ్ఞానమును అనుసరించియే నవయుగ కవి చక్రవర్తియైన జాషువగారు 'గబ్బిలము' అను కన్నీటి కావ్యమును వెలయించినారు. ఒక అరుంధతీ సుతుడు పరమేశ్వరునకు గబ్బిలముచే తన అశ్రుసందేశమును పంపుటయే ఇందలి ఇతివృత్తము.

'ప్రకృతి' అనినంతనే బాహ్య, అంతర ప్రకృతులు రెండును కవిపరిశీలనలోనికి రావచ్చును. కనుక ప్రకృతిలో మానవప్రకృతికూడ కలిసివిస్తృత భాగమును ఆక్రమించుకొని కనిపింపగలదు. ఈ రెండు ప్రకృతులపరిశీలన తీవ్రత ఎటు చూచినను 'గబ్బిలము' కావ్యము మొదటి భాగములోనే ఎక్కువగా కనిపింపగలదు. గబ్బిలము ఒంటరితనమునకు ప్రతీక. ఆ గబ్బిలముయొక్క ఆకారమును వర్ణించుచు, జాషువగారు ప్రకృతితో ముడిపెట్టిన విధము గమనింపదగియున్నది.

'ముక్కు మొగమున్న చీకటిముద్దవోలె
విహారణము సేయసాగె గబ్బిల మొకండు'

అనుచు కవిగారు విషాదమును ముద్దకట్టినారు. మరల అదే గబ్బిలమును 'నిద్దంపు లేతకస్తూరి ముద్దవనుచు నిన్ను జూచి ముచ్చటపడిరో ముద్దియలు' అని మనోహరముగా వర్ణించినారు. మనిషిమానసికావస్థలలో మార్పుననుసరించియే, అతనికి కనిపించు ప్రకృతికాని, ప్రకృతిలో వస్తువులుకాని గోచరించు నను సత్యమును బోధించుటకొరకే జాషువగారు ఈవిధముగా వర్ణించినారనుకొనవచ్చును. ప్రశాంతమనస్కృత ప్రధానముకాని ధన మాహాత్మ్యములు ప్రకృతి పరిశీలనలకు వర్తింపవని మన మూహింపవచ్చును. కనుకనే, గబ్బిలమునకు మార్గమును నిర్దేశించిన వ్యక్తి చిలక సముద్రపుటందములను జ్ఞాపకముచేయగలిగినాడు.

'తేటయైన తీపినీట దిక్కులదాక
విస్తరించి రుచులు గుస్తరించి
చిల్కసంభ్రమింపు సేయుచు గన్పట్టు
స్వచ్ఛమైన తెల్గుభాషవోలె.'

ఈ పద్యములో జాషువగారు వ్యక్తముచేసిన తెలుగుభాష యందలి మక్కువ గమనింపదగియున్నది. అచ్చమైన తెలుగు కవి కనుకనే జాషువగారు పైవిధముగా సంభావించుకొనినారు. భాషాభిమానమును వ్యక్తముచేసి తమ సంప్రదాయాభిజ్ఞతను వెల్లడించినారు.

'చిట్టి మరుదంకురంబులం
బుట్టిన కెరటాల ముత్తెములు తీరములన్
గొట్టుకొని మరలిపోవుచు
గట్టు లెగయజూచు చిలిపికవనముల
వలెన్.'

'చిటిపొటి' మాటలతో చిగురుమెత్తగా సాగిన దీపద్యము. మనస్సుదుఃఖపూరితమగుటకు ఆర్థిక కారణములు బలముగా పనిచేయుమాట వాస్తవమే అయినను, అనేక కారణముల పరంపరలలో అవికూడ భాగముపంచుకొనును. దీనుడైనను, హీనుడైనను ప్రకృతిని చూచి పులకించు మధురక్షణములు కొన్నియైనను ఉండుననుటకు పైపద్యము నిదర్శనము. 'చత్వారం బేర్పడిదారిం దప్పెదు గదా భాస్వంతుడే తెంచినన్' అని గబ్బిలము యొక్క సహజస్వభావమును చమత్కారజనకముగా చెప్పగలిగిన కవిగారి ప్రతిభ కొనియాడదగినది.

'ఛత్రములవంటి నీలిపక్షములు విచ్చి
నీవు బ్రహ్మాండమున బయనించు వేళ
జిత్తజల్లుల ముమ్మాయి ముత్తియములు
జలధరస్వామి నీమీద జల్లగలడు.'

గబ్బిలము యొక్క ప్రయాణము సుఖప్రదము కాగలదని యాశించుచు, శుభసూచకముగా జలధరస్వామి చిత్తజల్లుల ముత్తియములను చల్లగలడని చెప్పినారు. గబ్బిలముయొక్క కార్యసాధనకు ఇది కూడ కొంత దోహదము కాగలదు.

'మొలకసంధ్యారాగమున గెంపు లెగజిమ్ము
జరమాచలంబున జరణమూది
సెలయేటినీట నీతలు గొట్టి విహరించు
మరుదంకురముల సన్మాన మంది
కొండ కొమ్ముల నెదుర్కొని తుత్తునియలైన
తోయదమ్ముల మీద దుఱగలించి
కలహంస పొదిగి పిల్లలు సేయు మిన్నేటి
జాంగలంబుల మీద సంచరించి
చిలుక లెంగిలింప జిటిలి తేనియ లూరు
స్వాదుఫలము లెలమి నారగించి
కొన్ని నాళ్లపాటు కుటిలసంసారంబు
దిగులు మఱచి రమ్ము ఖగవధూటి'

ఆహ్లాదకరమైన ప్రకృతి వాతావరణమును వర్ణించి, కొన్ని దినములైనను కుటిలసంసారబాధను, దిగులును, మరచి; సుఖముగా సంచరించి రమ్ము. అని గబ్బిలమునకు ఉత్సాహాతిశయమును కల్పించినారు. గబ్బిలము యొక్క స్వభావమును వివరించుచు, సాత్వికాహారిణి అనియు, బిడ్డలగని పాలిచ్చెడు దొడ్డతనమున్న పులుగుదొరసాని అనియు ఉదాత్తముగా వర్ణించినారు. గబ్బిలమును 'ఖగవధూటి'; 'పురుగుదొరసాని'; పక్షిసుందరి' ఇత్యాదిగా మానవీకరించుట జాషువగారి కల్పనాచాతుర్యమును చాటుచున్నది. 'జాలివెన్నెల' అను పదబంధము నవ్యతను వ్యక్తముచేయుటయేకాక, జాషువగారి విశిష్టప్రయోగ నైపుణ్యమును వెల్లడించుచున్నది.

తాజమహాలును, మంచుకొండ
మానస సరస్సును, వ్రేపల్లెను కూడ
మానసికావస్థలలో నుండి;

విశిష్టతలను విస్మరింపకుండ వర్ణింపగల నేర్పు జాషువగారికి కలదు. కాని 'ఆకలి' మరపురాదు. ప్రకృతి నుండియే ఆకలి స్ఫూర్తిని కూడ కలిగింప జేసికొనుట కవిగారి ప్రతిభకు నిదర్శనము.

'ఒలికిపోయిన పండువెన్నెలపాలు
గ్రోలుచున్నది తపిత చకోరకంబు
ప్రొద్దుపోయెను నీచిన్ని భోజనమును
వెదకికొనఁబోమ్ము తబిసిగబ్బెతలరాణి.'

అని గబ్బిలమును హెచ్చరించినారు. ఈ సందర్భమునందిని గొప్పగా పాటించి, జీవనములో 'దేవ' ను 'ప్రకృతి' గీటురాయి మీద గీసి చూసికొని, మెరుగుపెట్టి జాషువగారు తమ కవితను బయటకు విడుదల చేసినారు.

'చామనచాయగలట్టిది
కామజనకు ననుఁగు భార్య కాళింది వినీ
లామల కోమల వీచీ
చామరములు వీచి నీకు స్వాగతమిచ్చున్.'

'అసమరుచిరాంబువైన మానస సరస్సు
కన్నకూఁతురు బుడుతగంగాభవాని
యెక్కి దిగుచుండ కొండలచక్కఁదనము
ప్రేక్షణీయంబు సుమ్ము గబ్బిలపుదేవి"

అని నదులను వర్ణించి, గబ్బిలమునకు ఆహ్లాదమును కలిగించుటయేగాక, 'అవి నీకు స్వాగతమును పలుకగలవు' అని ఆమెలో ఒకవిధమైన ఉత్సాహమును కలిగించుటకు ప్రయత్నించినారు.

'గబ్బిలము' రెండవ భాగమునందు ప్రకృతిని వర్ణించుచు-

'ఎంతకోయిలపాట వృథమయ్యెనో కదా
చిక్కచీకటి వనసీమలందు
ఎన్ని వెన్నెల వాగు లింకి పోయెనో కదా
కటికికొండల మీద మిటకరించి
ఎన్ని కస్తురిజింక లీడేరెనో కదా
మురికి తిన్నెల మీద పరిమళించి
ఎన్ని ముత్తైపురాలు భిన్నమయ్యెనో కదా
పండిన వెదురు జొంపములలోన
ఎంతగంధవహన మెంతతంగేటిజున్ను
ఎంతరత్నకాంతి యెంతశాంతి
ప్రకృతిగర్భమందు! భగ్నమైపోయెనో
రానిచోట బుట్టుకతన.'

పద్యమునందు ప్రకృతిలోని విశిష్టలన్నియు, మానవునకు అన్యాయింపక ఎక్కడెక్కడో వృథయైపోవుచున్న వని ఆవేదన వ్యక్తము చేయబడినది. 'పుట్టరాని చోటబుట్టుకతన' అని కథానుగుణముగా, కావ్య నాయకుని అధమవర్గజన్మమును స్ఫురింపజేసినారు.

'చంద్రచండకరులు సన్మార్గగతు లయ్యు
నొకనిజూచి యొక్కరోర్వజాల
రెండుకింత వైర మిరువురిలో ద్రావి
డీడెవండు దెల్గువాడెవండు.'

భాషాదురభిమానములను, ప్రాంతీయ దురభిమానములను వేలెత్తిచూపుటకు ప్రకృతినే సాధనముగా గ్రహించినారు. తెలుగు వానిని, ద్రావిడుని సూర్యచంద్రులతో పోల్చి వారికిగల వైరమును స్ఫుటతరము చేయుటకు కవిగారు ప్రయత్నించినారు.

అంటరాని తనములోని అవమానమును, దారిద్ర్యములోని బాధను తామనుభవించుటయేగాక, తమతోడి సోదరులు, బంధువులు జీర్ణకుటీరములలో నివసించుచు, గడించుచున్న కూలిడబ్బులు చాలక అరాకలితో మాడుచు, బ్రతుకలేక బ్రతుకుచుండగా చూచినప్పుడు జాషువ గారికి కలిగిన బాధకు చిహ్నమే ఈ గబ్బిలము. వినుకొండలోని కొండపైగల శివాలయమును చూచినప్పుడు అందులో నివాసమున్న పెక్కు గబ్బిలములు జాషువగారి ఊహకు దోహదకారులైనవి.

'నాదు కన్నీటి కథ సమన్వయము సేయ
నార్ద్రహృదయంబు గూడ కొంతవసరంబు'

అని ఇందలి కథానాయకుడు వాపోవును. కులీనులగు రాజులకువలె హంసములు, చిలుకలు మున్నగు నుత్తమ పక్షులితనికి చిక్కుట అసంభవము. కావున దరిద్రదేవతకు నివాసస్థానములైన జీర్ణకుటీరములలో నిరంతరము దర్శనమిచ్చు 'గబ్బిలము' ఇతనికి సందేశహారిగా పరిగ్రహింపబడినది. రసజ్ఞుల కిందలి ఔచితి సులభగ్రాహ్యము. ఈ మదోన్మత్త ప్రపంచములో పేదవారికి పులుగుపుట్రలే ఆప్తులని కవిగారి భావన. అదియునుగాక-

'ఆలయంబున నీవు వ్రేలాడువేళ
శివుని చెవి నీకుగొంత చేరువగనుండు'

అందుచేత నే తన సందేశమును రహస్యముగా పరమేశ్వరునకు విన్నవించుటకు ఒక్క గబ్బిలమే సమర్థురాలని కథానాయకుడు తలచినాడు.

పరమేశ్వరునకు సందేశమును పంపుటయే ఈ కావ్యము యొక్క విశిష్టత. ఇంతవరకుం దేశకావ్యములందును పరమేశ్వరునకు సందేశమును పంపినట్లు లేదు. ఇది జాషువగారి విశిష్టప్రయోగము. శివుడు శివంకరుడు; భక్తవశంకరుడు. కనుకనే జాషువగారు శివునకే తమ సందేశమును పంపినారు. సమాజములో నున్న సాంఘిక ఆర్థికాది, అసమానతలను బాపి సర్వమానవ సౌభ్రాత్రమును నెలకొల్పగల సమర్థుడు 'అసమనేత్రు' డొక్కడే యని కవిగారి యూహ. తమ కావ్యమునకు ప్రేరణ 'మేఘసందేశ' మని చెప్పుకొనినారు. అందువలననే ఈ కావ్యము ప్రకృతితో విడదీయరాని అనుబంధమును కలిగియున్నది.

'గబ్బిలము' న అధమవర్ణులు వర్ణింపబడినారు. కాని యిది ఆత్మాశ్రయరీతికి చెందిన అగ్రశ్రేణి కావ్యము. సందేశహారియైన గబ్బిలము అధమజాతికి చెందినదైనను సందేశము ఉత్కృష్టమైనది. సంఘసంస్కరణాభిలాషులకు, కరుణరసపిపాసువులకు, ప్రకృత్యభిమానులకు, నవ్యతాప్రియులకు ఈ కావ్యము మరువరానిది.

['జాషువకృతులు : సంప్రదాయము - నవ్యత' అను నాఅముద్రిత సిద్ధాంత వ్యాసమునుండి ఇందులోని విషయములు గ్రహింబడినవి. పరిశోధన పర్యవేక్షకులు, అస్మద్గురువర్యులు అయిన డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, పిహెచ్.డి. పట్టము నొసంగిన ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులకును నా కృతజ్ఞతాంజలులు!] జి. బి. ఎన్. ఆచార్య.

ఆధునిక మానవ ఇతిహాసం :

# సోమరసం - సుందరకాండ

- శ్రీ శివలెంక ప్రకాశరావు.

శ్రీమద్రామాయణంలో పవిత్రమైన ఒక రసవత్తరఘట్టం సుందరకాండ. కండబలంతో లంకానాథుడు బంధించిన సీతామహాసాధ్విని బుద్ధిబలంతో మారుతి అన్వేషించి విజయమొందడమే ఇందలి ఇతివృత్తం. 'కోల్పోయిన అంతరాత్మను' వెదకి సాధించడమే దీని అంతరార్థం. 'ధీమంతుడైన మానవుని ప్రజ్ఞాపూర్వక గవేషణకు సుందరకాండ ఒక సజీవ సంకేతం.'[1] అలాగే సర్వమానవ సంక్షేమానికి సామూహికంగా మానవులొక మహాయజ్ఞం నిర్వహించి సోమపీథులయారు. సోమరసం సమష్టి ఆనందానికొక సంకేతం[2].' 'వ్యష్టిసమష్టుల సమ్యక్ స్వరూపమే సమాజ చరిత్రకు ప్రాణం.[3]' 'సమష్టి ఆనందానికై వ్యష్టిగాచేసే అన్వేషణం' గూర్చిన వాఖ్యానమే శ్రీ సోము సుందర్ గారు రచించిన 'సోమరసం - సుందరకాండ' కావ్యం. 'మనోహృదయాలకు మధ్యసాగే సంవాదరూపంలో పరాత్మక భావానుభూతుల నెన్నిటినో స్వాత్మక మొనర్చి'న[4] ఒక రసవత్తర రూపకం ఇది.

'ఏమిటి అవలోకిస్తున్నావు సోమూ?
ఏమిటి ఆకర్ణిస్తున్నావు ఆత్రంగా'

అని మనసు ప్రశ్నించడంతో కావ్యారంభ మవుతుంది. దానికి 'సేలలు, సెలయేరుల సోనలు - వాగులు - మహానదులు చూస్తున్నా ననీ లోయల ప్రతిధ్వనించే పాటలు, మాటలు, కేకలు వింటున్నాననీ సమాధాన మిస్తుంది హృదయం. ఈ విధంగా ప్రశ్నోత్తరాలతో కావ్యం ముందుకు సాగుతుంది. సకల విజ్ఞానానికీ ప్రశ్నోత్తరాలే మూలం కదా!

మానవుడు మొదట నిద్రాణంగా, నిస్తేజంగా పడిఉండి క్రమంగా శక్తి పుంజుకొని సత్యాన్వేషణ సాగిస్తూ, ప్రకృతిని తనకు అనుకూలంగా మార్చుకొంటూ, విశ్వాసంతో గతాన్ని బట్టి, ఆగతాన్ని ఊహించుకొని, వర్తమానాన్ని మలచుకుంటాడు. చివరకు ఎన్నో కష్టాల కోర్చి అయినా తన గమ్యాన్ని చేరుకొని ఆనందాన్ని పొందుతాడు. తనజన్మ ధన్యం చేసుకొని, తోడివారికి కూడా తాను పొందిన ఫలాన్ని పంచుతాడు. ఈ విషయాన్నే జీవనదాన, ప్రాణస్పందన, బీజారోపణ, నీలముకుర, వివిధార్థసంగ్రహ, సరసప్రభాస, ప్రతాపాదిత్య, ఆనంద మంగళగీత అను వివిధ ఘట్టాలలో వివరించాడు కవి.

మానవలోకం భిన్నవ్యక్తుల, విభిన్న వ్యక్తిత్వాల సమ్మిశ్రితం. కష్టపడి పొట్ట పోసుకు నేవాడొకడైతే కష్టజీవుల పొట్ట గొట్టేవాడు మరొకడు. చెమటోడ్చి చెట్టును పెంచేవాడొకడైతే, దాని ఫలాలను భక్షించి మట్టుపెట్టేవాడొకడు. ఇటువంటి దుష్టశక్తులు లోకంలో ఉన్నంతసేపు అశాంతి, అసహనం తప్పవు. అందుకే ఈ కుత్సిత మతులను 'ఎలుగుబంట్లు, మిడుతలదండ్లు, రాబందులు, డేగలు, గ్రద్దలు, కాకులు ఇత్యాది ప్రతీకలతో వివరిస్తాడు కవి.

శ్రమజీవులు తమ శ్రమను మరచిపోయి నిరాడంబరంగా ప్రభాతగీతాలు,తుమ్మెద పదాలు, నివాళి పదాలు పాడతారు. వారి మధుర కంఠస్వరం నిజాయితీకి ఒక చక్కని నిదర్శనం. ఆ పాటలు విన్న కవి హృదయం 'నిట్టూర్పుల తాళ్ళు పేనుతూ వారి నిజాయితీకి మూల్యం' కడుతుంది. ఎందుకంటే

'ఊహల హాల్యల కళ్యాణంచేయాలని
వెతముడులను విప్పాలని
జడి రొదలను కప్పాలని
ముచ్చట ముడి వేయాలని
సుఖంపూలు ముడవాలని'

కవి ఆకాంక్ష.

మనిషి తన భావిజీవితం మలచుకోవడంలో ఎన్నో కష్టనష్టాల నెదుర్కొంటాడు. ఈ అన్వేషణలో, పయనంలో 'జీవిత మొక యాత్రాస్థలం. భవిష్యత్తు మూలవిరాట్టు. మానవయత్నాల వివిధ స్వరూపాలు ఉత్సవ విగ్రహాలు.' జీవితంలో పొందబోయే సుఖంవంటిది యాత్రలో మూలవిరాట్ దర్శనం. మధ్యలో కనబడే ఉత్సవవిగ్రహాలను చూడడంవంటివి లక్ష్యంచేరడంలో చేసే ప్రయత్నాలు. ఈ అన్వేషణలో మనిషికి నిద్రాహారాలు లేవు. శ్రాంతిని లెక్కచేయడాతడు. సాధించవలసిన కార్యం బాపతు ఆలోచనలు ఎడతెగకుండా ఉంటాయి. అందుకే కవికి అకస్మాత్తుగా అర్థరాత్రి మెలకువ వచ్చింది. అప్పుడు దూరంగా చుట్టూ మనిషిపడే అవస్థలకు గుర్తుగా నక్కల ఊళలూ, కోడెగాండ్రకు పిల్లగాడ్పుల మేలుకొలుపులు, ఆకాశంలో 'హిమకణాల తుషారాశ్రువుల' సవ్వడి, తాత్కాలిక సంసారసుఖం అనుభవిస్తున్న తల్లి పాలకోసం పసిపిల్ల రోదన, కీచురాళ్ళ రొద, పాలమసలవ్వ గర్భశోకపు సొద, చెరువుగట్టుమీద పాడు కలగన్న పక్షివ్యథ! వినిపించాయి.

సత్యాన్వేషణకు పూనుకున్న మనిషిని లోకం చూస్తూ ఊరుకోదు. పైగా కష్టాల విషపురూడు వడ్డిస్తుంది. వంటినిండా 'ఏప్పుల పల్లేరుముళ్ళు' గ్రుచ్చుతుంది. దాంతో మానవహృదయాకాశంలో ఆవేదనామేఘాలు క్రమ్ము 'కారునలుపు పొగ లలముకొని

పొగ్ని రగులుకొని మెరుపులు మెరుస్తాయి. కలవరపడ్డ హృదయబింబం ఊరటలేని ఉరుములతో ఉగ్రరూత లూగుతుంది. చివరకు దుఃఖాశ్రువులు ఏరులుగా ప్రవహిస్తాయి. అప్పుడు మనిషి మనస్సు 'ప్రశ్నల తూణీరం' గా రూపొందుతుంది. 'ఒక మహాజగతి'ని తనలో నిర్మించుకొని, వర్తమానకాల ముకురంలో 'మహదుజ్జ్వల భావగతి' ని కనుగొంటూ, లోకంలో అనుభవంతో పండిన హృదయాలను పరీక్షిస్తూ, 'సర్వత్రా పరిణామం కాంక్షిస్తూ, తననుతానే ప్రశ్నిస్తూ' మనసు బ్రతుకుతుంది. అందుకే 'ప్రశ్నల కొడవళ్ళు' దాల్చి 'సమస్యాసస్యాలను' కోసి కుప్ప వేసి 'గవేషణా గజేంద్రాలతో' నూరుస్తుంది. అని అంటాడు కవి.

సస్యం కోయడానికి ఉపయోగించేది కొడవలి. అలాగే సమస్య అనేది కోయాలంటే ప్రశ్న అనే కొడవలి కావాలి. ప్రశ్నార్థకం కొడవలి ఆకారం (?) లో ఉండటం విశేషం. ఇది వస్తుస్వరూప సామ్యంతో ఏర్పడిన పదచిత్రం అలాగే 'సమస్య'లో 'మ'కారం లోపిస్తే, 'సస్య' మవుతుంది. ఇది 'మకార' స్వరూపమైన లక్ష్మి. ఇది పదస్వరూప సామ్యముతో ఏర్పడిన పదచిత్రం. ఇట్టివి కవిప్రతిభను తెల్పుతాయి.

'కవిత్వం ప్రముఖంగా భావస్ఫోరకంగా, పఠితృలోకపు ఆలోచనా భాండారానికి కొత్తకాంతి సమకూర్చేదిగా[5]' ఉండా లని సోమసుందర్ గారి లక్ష్యం. 'చెప్పబడని విషయాన్ని చెప్పబడని రీతిగా చెప్పగలగడమే[6]' కవిప్రజ్ఞ అని ఆయన నమ్మిక. ఇదేభావం 'A more than usual state of emotion with more than usual order' అనే కాల్‌రిడ్జి వాక్యంలో ద్యోతక మవుతుంది.

హృదయమనే అక్షయతూణీరంనుంచి పుంఖానుపుంఖంగా ప్రశ్నలుదయిస్తాయి. అవి – చీకటిలో రంగులు పూసుకున్న పువ్వు ఉదయమే ఎందుకు వికసించాలి ? మనిషికో ముఖమూ, చెట్టుకోరకమైన పువ్వూ ఎందుకుండాలి ? పగలు భ్రమరాలను పరిభ్రమింపజేసిన పుష్పం సాయంత్రం నేలపై ఎందుకు రాలాలి ? శిశువు కల్గినపుడు ఆనందించిన సంసారి, దేహాంపంచత్వ మొందినపుడు శోకించడమెందుకు ? మొదలైనవిగా ఉంటాయి.

'సజీవాగ్ని శిఖల పరుగులవలె వడిగా నడిచేమానవుడొక మహాశక్తి. ఎన్ని అగ్నిపర్వతాలు బ్రద్దలయినా, భూకంపా లెన్నివచ్చినా, ఏమహామ్మారి విలయతాండవం చేసినా, సముద్రమంతా పొంగి మన్నూమిన్నూ ఏకం చేసినా నరజాతి మాత్రం నశించదు. దేహికి సహజసిద్ధమైన జీవన్మరణాల వల్ల రూపాలూ, పేర్లూ, చరిత్రలూ మారవచ్చు కాని మనిషి మాత్రం చిరంజీవి. అందుకే మర్త్యుడైన మానవుడు 'అమరు' డంటాడు కవి.

ఒకనాటి మానవుడు కన్నకలలు కల్లలయినా నేటి మానవుడు మహోజ్జ్వలంగా పురోగమిస్తున్నాడు. అతనికి 'మహాశక్తి ప్రదాతగా' భాష తోడై, భావప్రకటనకు సంభాషణంగా', సరసామోద సంగీతం'గా రూపొంది 'కాలదూర పరిధులను కడతేర్చి'విశ్వమానవ ప్రేమను విస్తరింపచేస్తున్నది. అలాగే మనిషిచేసే సర్వప్రయత్నాలకూ ప్రకృతిమాత చేయూత నిచ్చి అతని విజయసాధనకు తోడ్పడుతున్నది. తన రహస్యాలను 'మానవాత్మ తేజంతో, మిళితంచేసి 'జగద్గీత'ను వినిపించి లోకాన్ని రసాబ్ధిలో ఓలలాడిస్తున్నది. ఆ ఫలితంగానే లతాగుల్మాలు వివిధ ప్రసూనాలు ప్రసవిస్తాయి. పిల్లగాలులు మెల్లగా వీస్తూ సుగంధాలను వెదజల్లుతాయి. పక్షులు కిలకిలారావాలుచేస్తూ ఎగురుతూ, గెంతుతూ నాట్యాలాడతాయి. ఈ ప్రకృతిశోభ అంతా మనిషి హృదికి రక్తినీ, శక్తినీ ప్రసాదిస్తుంది. అయినా చీకటి వెలుతురులు' కలిసి జన్మించిన నరుని జీవితంలో కష్టసుఖాలూ, సంతాప సంతోషాలూ, పాపపుణ్యాలూ తప్పవు.

మనిషికీ భూమికీ ఒక అవినాభావ సంబంధం.అది రాత్రింబవళ్ళమధ్యగల 'అసుర సంధ్య'వంటిది. మనిషికి మనుగడకోసం, ఆనందంకోసం సంఘర్షణ తప్పదు. రాజెంత బలవంతు డయినా ఒక్కొక్కసారి పరాజితుడయినట్లే మనిషి తన హృదయానికి దాసుడై కొన్ని అకృత్యాలు చేస్తాడు. నిత్యం జరిగే ఈ సంఘటనల సంఘట్టనలో, సంఘర్షణలో ప్రయత్నమనే మహాధ్వరంలో మనిషి ఎన్నోముప్పు తిప్పలు పడతాడు. సత్యాన్వేషణ ప్రయాణంలో పరాజితుడయి పరితాపతాపం దహించి నప్పుడు నరుడు భూమాత నాశ్రయించి ఆమె గర్భంలో విశ్రాంతి తీసుకుంటాడు. ఆతల్లి సమక్షంలోనే అవమానాలను, అనుమానాలను ఓర్చుకుంటూ, తేర్చుకుంటూ మూలకారణాలకోసం పునరాలోచిస్తాడు. ఈ ముందు వెనకలకు పోయేభ్రమ, పరిభ్రమణ శీలం మనిషి స్వభావంలోనే ఉంది. అందుకే 'నిస్తబ్దత, నీరసత్వ నిశ్శబ్దత, చలనరహిత జడత్వాలు, శిలామయస్థాణుత్వము మానవతకు రుగ్మతలు. ప్రగతిశీలక పురోగమన మొక్కటే నరజాతికి చేతన ధ్వజం' అని అంటాడు కవి.

మనిషి మన స్సొక 'ధగధగల దర్పణం'. 'నవనవోన్మిషితం'– కానట్టి ప్రకృతిలోని 'తుమ్మెదల హొయలు', కోయిలల వగలు, నెమళ్ళసిగలు, తరంగాల పొగలు

ఇత్యాది 'లీలా సుందరరూపా లన్నీ' మనిషి భావనావైచిత్రిలో వర్ధిల్లుతాయి.

ప్రతి మానవ జీవికీ ఆశ స్వభావసిద్ధం. ఆనందానురక్తి దాహం సౌఖ్యాకాంక్ష నైజం. సౌందర్యాన్వేషణ ఒక 'హాబీ'. అందుకే మనిషి నిర్వికల్ప సమాధిమగ్నుడై 'వాల్మీకి'గా ఆలోచనామృత కవిత్వం సాధించాడు. 'చిత్తచైతన్య విక్రాంత జ్యోతి రగిల్చి- నవనవోన్మేషశాలిని యైన ప్రతిభ'తో సంగీతాది వివిధ కళలను హస్తగతం చేసుకున్నాడు. 'సంపూర్ణ మానవత' కోసం, తన ప్రాణాన్నే పణంగా ఒడ్డిన ఈ ప్రయత్నంలో 'జీవవాహిని మహోద్ధృత తరంగమయింది.' 'జ్ఞానరేఖలు' హృదయంలో మెరిసాయి. భావనోత్సవ చైతన్యం వ్యాపించి, భావి మహోజ్జ్వలంగా ప్రకాశించింది.' మానవుడమరుడై కాల ప్రవాహంలో 'ప్రహ్లాదు'డయాడు. కాని అంతటితో ఊరుకోక నరుడు చుట్టూఉన్న సమాజాన్ని ఉద్ధరించడం కోసం 'విశ్వామిత్రాది' పెక్కు అవతారా లెత్తి, తన మేధాసముద్రం త్రచ్చి, నవనీత అమృతభాండంగా రూపొందించి జాతి జనులందరికీ సోమరసం' పంచాడు. తానమరుడై, అందరికీ అమరత్వం సిద్ధింపజేసి, విశ్వమానవ కళ్యాణంకోసం భూమాత హృదయాన్ని 'ఒక కోటికేవల కంజాతంగా విరియించి మమతను, నవతను, మానవతను పండించి ఒక నవ సమాజాన్ని నిర్మించాడు నేటి మానవుడు.



# 'ఆరుద్ర' కూనలమ్మ పదాలు

— రత్నశ్రీ (యస్. రాజశేఖర్, బి. ఏ.)

నేటి అభ్యుదయ కవిత్వానికి మూల స్తంభాలలో ఆరుద్రగా రొకరు. సుమారు పదిహేను సంవత్సరాలు సాహిత్య రంగంలో ఎనలేని సేవ చేస్తూ, అన్ని ప్రక్రియల్లోను ఆరితేరినవా రని పలువురు ప్రముఖులచేత ప్రశంసిపబడినారు. సంప్రదాయానికి ఎదురు తిరిగే. సాహసమూ - భాషలో, భావాలలో క్రొత్తదనము చూపించా లనే ఆసక్తీ - ఈనాటిసమాజాన్ని రచనలో ప్రతిబింబింపచేయా లనే తపన ఆయన సాహిత్యానికి ప్రధాన ధర్మాలుగా కానవస్తాయి. ఇంగ్లీషు తెలుగు కలిపి కొత్త సమాసాలు చేయడం, ఉన్న సమాసాలు - స్వరూపాలు మార్చడం, భాషలో ఇంకా ఎన్నో తమాషాలూ చేస్తూంటాడు ఆయన.

'ఆరుద్రకు నియమోల్లంఘనం చేయడమే స్వభావమనీ; అతని రచలలో బాలవ్యాకరణాన్నీ పాణీయాన్నీ వెతకడం వ్యర్థం; కవిత్వమనే పదార్థమే యింతకుమించినది అనేదృష్టితో అతని రచనలు చదవాలనీ; డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులంటారు. సంప్రదాయ సిద్ధంగావస్తున్న కవితారీతుల్లో అలవాటు పడ్డ ఎక్కువమంది పాఠకులకు ఆరుద్ర ఒక కొరకరాని కొయ్య. ఆరుద్ర చమత్కారంతో పాఠకుణ్ణి చప్పున ఆకర్షిస్తాడు. అతనిచేత అర్థాన్వేషణ చేయిస్తాడు. అరటిపండు వొలిచినట్లు చెప్పకుండా కొంచెం ఆలోచింపచేస్తాడు. ఒక్కొక్కసారి చాలా స్పష్టంగా, హృదయానికి హత్తుకొనేలా చిన్న చిన్న పదాలతో చక్కని భాషలో ముచ్చటగా చెప్తాడు. టెక్నిక్ లేని కవిత్వాన్ని ఆయన ఊహించలేడు. ప్రత్యేక సంవిధాన రహిత వాక్యసందోహాన్ని వాక్సృద్ధి - ధారా - భాషా - వైదుష్యాలని పోనాడిన మాటల దొంతరలను కవిత్వంగా ఎంచలేడు.

ఆరుద్ర అభ్యుదయకవి. అహంభావ కవి. ఆహ్లాదం కల్గించే కవి. పాఠకుడికి మల్లే కవికికూడా క్రమశిక్షణ ఉండాలనీ, అది కవిత్వంలో ఛందస్సువాడితేనేగాని రాదనీ, అందువల్లనే నేను ఛందస్సుకు కట్టుబడివున్నాను అనీ వ్రాసుకున్నాడు 1965 లో. కవిత్వం ఎప్పుడూ హృదయానికి నరిష్మెంట్ కావాలి కానీ పనిష్మెంట్ కాకూడ దంటాడు. ఆరుద్ర కవిత్వం ప్రజలకోసం అని తానే అంటాడు. ఆరుద్ర కేవలం సిసలైన కవే కాదు. కవిత్వంతోపాటు ప్రయోగాలు, వాటికి సంబంధించిన నవ్యత్వమూ అనే అంశాలకోసం పాటుపడే మేధావి.

'ఆరుద్ర తన ఛందస్సుల చేత అందంగా చాకిరీ చేయించుకోగలడు.' అన్న శ్రీశ్రీమాట అక్షరాలా నిజం. అన్యదేశ్యాలను సొంతభాషకంటే ప్రతిభావంతగా ప్రయోగిస్తాడు. రచనలతో అనేక చమక్కులు, గమ్మత్తులు చేస్తాడు. ఆయన కవిత్వంలో ఆవేశం, ఆక్రోశం, ఆవేదన, ఆక్రందన, ఆహ్లాదము, సందేశము, సునిశితమైన హాస్యము ఉన్నాయి. కవిత్వంలో అన్యభాషాపదాలను అంత్యప్రాసలకు, అనుప్రాసలకు వాడుకుని భాషకో అందాన్ని తెచ్చాడు. ఆరుద్రవ్రాసిన ప్రతీరచనలోను కొత్తదనము, భావపరీమళం గుబాళిస్తుంది. ఆయన 1 కూనలమ్మ పదాలు 2. పైలాపచ్చీస్ 3. త్వమేవాహమ్ 4 సినీవాలి 5. గాయాలు - గేయాలు 6. ఎంచిన పద్యాలు

7. వేమన్న వేదం. 8. ఇంటింట పజ్యాలు. 9. 'కొండగాలి' 10. సమగ్ర ఆంధ్ర సాహిత్యం మొదలైన రచనలు చేసి ఆధునికాంధ్రసాహిత్యంలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్నారు.

'కూనలమ్మపదాలు' అంటే కూనలమ్మ అనే దేవతపై వ్రాసినవి. ఇటువంటిపదాలను మొదట శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు సేకరించారు. తర్వాత సంకలనగ్రంథంగా 'కృష్ణశ్రీ' గారు పల్లె పదాలను సేకరించి ప్రకటించారు. అసలు ఈ కూనలమ్మపదాలు ఇప్పటివికావు. ఎప్పట్నుంచో శ్రీనాథుని కాలం నుంచీ వస్తున్నాయి. ఇవి ఇప్పటికే గుంటూరు, నెల్లూరు ప్రాంతాలలో ప్రఖ్యాతిగాంచాయి. వేదపురాణాలు, ఉపనిషత్తుల సారంకూడా ఈ పాటలలో స్పష్టంగా కనిపిస్తూ ఉంటాయి. ఈ పదాలను అనేకులు అనేకమకుటాలలో వ్రాసారు. కొందరు 'ఓనాయనమ్మా అనీ,' కొందరు 'ఓనాయుడమ్మా! అనీ ఇలా కోకొల్లలుగా వ్రాసారు. కొన్ని పుస్తకాలలో ఈపదాలకు చక్కని రూపకల్పనచేసి చదువరులకు ఇంపుగా, ఆసక్తిదాయకంగా మలిచారు. ఆరుద్ర కూనలమ్మ పదాలకు ప్రముఖ చిత్రకారులు బాపు, గోపులు చక్కని రూపకల్పనచేశారు. ఈ పుస్తకంలో ఆరుద్ర ప్రత్యేకత ప్రతీ పదంలో కన్పిస్తుంది. పదాల పొదుపు, సులభమైన పదాలు, వేమన్నలానీతి అందమైన భాషలో అందిస్తూ, ఇతిహాసాల్ని సూక్ష్మంగా చెప్పి సెబాస్ అనిపించుకున్నాడు. ఈ రచనలో ఒక వైవిధ్యం, వైశిష్ట్యమూ ఉన్నాయి. పఠితల్ని మళ్ళీ మళ్ళీ చదివించే గుణం ఎక్కువగా కన్పిస్తుంది. పెద్దభావాన్ని చిన్నపదాల్లో చెప్పి తన నైపుణ్యాన్ని చాటుకున్నాడు. ఆరుద్ర ముద్రతో, ఇదేమకుటంతో శ్రీ 'రసిక్' (గుత్తం భానుమూర్తి) కూడా వ్రాసి ప్రశంస' లందుకున్నారు. ఈ 'కూనలమ్మపదాలు' ముఖ్యోద్దేశం ఆహ్లాదం కల్గించడం, విజ్ఞానాన్ని పెంచడం, ఆలోచింపచేయటం అని చెప్పవచ్చు. జానపద గేయాలవలె మరుగున పడిపోయిన ఈపదాలను వెలుగులోకి తెచ్చి, ఆ పాతపదాల రమణీయమైన ఛందస్సులో ఆధునికంగా,పదాలు రచించాడు ఆరుద్ర. నాగ్లవారు, పోతుకూచివారు వ్రాసినవి కూడా ఇదేపంథాలో ఉంటాయి. ఆరుద్ర కవిత్వంలో 'Economy of words' అనే లక్షణం కన్పిస్తుంది. ఈ కూనలమ్మ పదాల్లోని అందమంతా, తొలి మూడు పాదాల అంత్య ప్రాసలే. తెలుగుపాటకు సహజమైన అదిప్రాసలు, వివిధపాదాల అద్యక్షరమైత్రీ ఈపదాల్లో ఉన్నది. ఈపదాల్లో భావసంక్షిప్తత, రమణీయత, విశ్వజనీనత, భావసౌకుమార్యము మొదలైన లక్షణా లున్నాయి. ఈపదాలు నవరసాలకు ప్రాతినిధ్యం వహించాయి. కూనలమ్మపదాలు కొన్ని అందుకోండి.

'చిన్నిపాదములందు
చివరి ప్రాసలచిందు
చేయు వీనులవిందు
ఓ కూనలమ్మ. (మకుటం).

అందరికీ అర్థమయ్యేరీతిలో చెప్తాడు.

'పెనుసమాసము లున్న
పెద్ద వృత్తముకన్న
చిన్న పదమే మిన్న
ఓ కూనలమ్మ.

పరులకు మేలుచేసేవారి మార్గం మనకు ఆచరణ యోగ్యం అంటాడు.

'పరుల మేలునుకోరి
పదముల ల్లెడివారి
పథము చక్కనిదారి,
ఓ కూనలమ్మా !

కవిత్వంపై ప్రభుత్వం పన్ను వేయదు.

'పన్ను వేయని ప్రభుత
పన్నుహమ్యామరు కవిత
ప్రలకెంతో మమత
ఓ కూనలమ్మా !

అల్లుడు దుర్మార్గుడట. ఎలాంటి అల్లుడో చెప్తున్నాడు చూడండి.

'పిల్ల నిచ్చినవారి
పీకమీద సవారి
చేయు అల్లుడె మారి
ఓ కూనలమ్మ !'

'ప్రేమ గుడ్డిది' అన్న భావాన్ని ఎలా చెప్పారో చూడండి.

'తాను మెచ్చిన కొమ్మ
తళుకు బంగరు బొమ్మ
వలపు గుడ్డికదమ్మ
ఓ కూనలమ్మ'

అనేక పార్టీలలో ఉండటంవల్ల వచ్చే అనర్థాన్ని క్రింద చెప్తాడు.

'సగము కమ్యూనిస్టు
సగము కేపిటలిస్టు
ఎందుకొచ్చిన రొస్టు
ఓ కూనలమ్మ!

మద్యపానంవల్ల మెదడు పాడవుతుంది.

'తాగుచుండే బుడ్డి
తరుగు చుండే కొద్ది
మెదడు మేయును గడ్డి.'

(ఓ కూనలమ్మ మకుటం ప్రతీదానికి వస్తుందని గ్రహించాలి.)

రామాయణ, భారత, భాగవతాదులను గురించి మూడు ముక్కల్లో ఏమంటాడో చూడండి.

'భాగవతమున భక్తి
భారతములో ముక్తి
రామకథయే రక్తి.

సీత అడవికి వెళ్ళటం అష్టకష్టాలుపడటం, రావణాసురుడు తీసికెళ్ళిపోవడం ఇత్యాది కథ అంతా సంక్షిప్తంగా సూక్ష్మంలో మోక్షం అన్నట్లు వినిపించాడు.

'భర్తతోడను సీత
పట్టుపట్టుట చేత
అట్లు తగులడె రాత.'

ఎన్ని మతాలు, ఎన్ని కులాలు ఉన్నా పేద, ధనిక భేదం ఉన్నా ఆఖరికి అంతా వల్లకాటిలో బూడిదఅవుతారని వేదాంతం చెప్తాడు.

"పేదలే కానిమ్ము
ప్రభువులే కానిమ్ము
చివర కవరా దుమ్ము.'

నీతి నేడు ఒక ప్లేగు అంటాడు.

'నీరు యెత్తున కేగు
నిజము చాటున దాగు
నీతి నేడొక ప్లేగు.'

అనేక ఉత్తమ గ్రంథాలు చదివి వాటి సారంమనకు కవితా తుషారంలో అందించాడు.

'వివిధ నీతులు గలవి
పెక్కు బుక్కులు చదివి
నేను చేసెద మనవి.

ఇష్టం లేని పెళ్ళి చేసుకుంటే సుఖంఉండదంటాడు.

'మనసు కుదరని పెళ్ళి
మరుదినమ్మున కుళ్ళి
సుఖము హుళ్ళికి హుళ్ళి.

దేవుడుకూడా కాలవశమున వ్యాపారిగా మారిపోయాడు.

'కాలవశమున మారి
చాలముడుపులు కోరి
దేవుడే వ్యాపారి.

వనిత ఎలాంటి దంటే 'తీయనిచేదు' అంటాడు.

'పిలిచి నప్పుడు రాదు
వెడలగొట్టిన పోదు
వనిత తీయనిచేదు.'

జ్ఞాని లక్షణము చెప్తాడు.

'గడ్డిపోచలు పేని
గట్టి ఏనుగు నేని
కట్టువాడే జ్ఞాని.'

దేవుని కంటే మానవుడే అధికుడని క్రింద వివరిస్తాడు.

'ఎద్దు నెక్కెను శివుడు
గద్దపై మాధవుడు
ఘనుడు మన మానవుడు.'

మతము అందరికీ సమ్మతము కావాలికానీ అది పెనుభూతం కారాదు.

'కసిని పెంచే మతము
కనులు కప్పే గతము
కాదు మనకు అభిమతము.'

పుణ్యగాథలను గురించి

'పుణ్యగాథల బూతు
బూజుపట్టిన ట్రూతు
అంతుచిక్కదు లోతు.'

శ్రీకృష్ణుని గొప్పతనాన్ని చెప్తాడు. తాగిన రొమ్ము గుద్దెడివాడు కృతఘ్నుడు. అయితే కృష్ణుడు రాకాసిని (పూతనని) చంపాడు.

'గ్రోలెనె స్తన్యమ్ము
గుద్దెనే ఆ రొమ్ము
వాడెపో దైవమ్ము.'

శ్రీకృష్ణుడు పక్షపాతము చూపించాడు చీరలు దాచి

'చెలుల చీరలు దోచి
చెల్లి చీరను గాచి
చేసెనే లాలోచి.'

బాలకృష్ణుడు చేసిన ఘన కార్యాల్లో కొన్ని

'బండి కూల్చెను తొల్లి
బండి తోలెను మళ్ళి
దండి ఊసర వెల్లి'

హిందూమతము 'ఏకపత్నీవ్రతము' చాటుతుంది. అయితే దేవుళ్ళకి భార్యలువందలమందిఉన్నారు. ఈ విషయం అంతా ఆలోచించవల్సినదే.

'ఏకపత్నీ వ్రతము
ఎలుగెత్తు మనమతము
వేల్పు భార్యలో శతము.'

ఆశ, ప్రతిభలు ఎలాంటి వంటే_

'ఆశ తీరని తృష్ణ
అఘము తేలని ప్రశ్న
ప్రతిభ అటవుల జ్యోత్స్న'-

గొప్పవాడు తప్పుచేస్తే అది చెప్పుకోరు. తక్కువనాడు తప్పుచేస్తే ఒప్పుకోరు. ఇద్దరూ చేసేది ఒకేతప్పు అయినా శిక్ష తక్కువ వాడికే! ఉన్నవాడి కొక న్యాయం, లేని వాడి కొకన్యాయం ఉండటం అన్యాయం.

'లంచ మనియెడి ఉప్పు
క్లార్కు తింటే తప్పు
ఘనుడు తింటే మెప్పు.'

చెప్పేవి శ్రీరంగనీతులు చేసేవి దుర్మార్గాలు. ఎదుటివాడికి పంగనామాలు పెట్టి తాను విభూతి నామాలు పెట్టుకుంటాడు. లోకానికి మంచిభక్తుడులా కన్పించడానికి నటిస్తాడు. అది తనను తాను మోసపుచ్చుకోవడమే కాదా! చేసే చెడ్డ పనులు చేసేస్తూ గంగలోమునిగితే పాపం పోతుందా?

'నరుడు మదిలో దొంగ
నాల్క బూతుల బుంగ
కడుగ జాలదు గంగ.'

'పంగనామము లేల
భస్మపుండ్రము లేల
భక్తి నిజమగు వేళ.'

ఆత్మవంచనవల్ల మనిషి తానే చెడిపోతాడు.

'ఆత్మవంచన వల్ల
ఆడు కల్లల వల్ల
అగును హృదయము డొల్ల.'

మూర్ఖుడు తనకు తెలియని విషయాన్ని ఇతరులు చెప్పగా విని తెల్సు కొనక, వాదిస్తాడు. చెప్పేవాడినే నీచంగా చూస్తాడు.

'వాత లుండిన నక్క
వ్యాఘ్ర జాతిలో లెక్క
అనును కద తల తిక్క'

నూతిలో కప్పకు నుయ్యే ప్రపంచం. దాని గొప్ప తప్ప ఇతరుల గొప్ప ఒప్పుకోదు,

'నూతిలోపలి కప్ప
పాత ఘనతలు తప్ప
మెచ్చ దితరుల గొప్ప'

నిజం నిప్పులాంటిది. యథార్థవాది లోకవిరోధి అన్నాడు.

'చెక్కు చెదరని వక్త
చేదు నిజము ప్రయోక్త
చంపబడును ప్రవక్త.'

దేవుని పేరు చెప్పి చందాలు ప్రోగుచేసి స్వాహా చేసేవారు బాగుపడరు.

'చెప్పి దేవుని పేరు
చెడుగు చేసెడివారు
ఏల సుఖపడతారు.'

వేదాంతాన్ని ఒక్క దృష్టాంతంలో చెప్పాడు.

వల్లకాట్లో బూది
స్వార్థపరు డను 'నాది'
మమత బ్రతుకు పునాది.'

కొత్త పెండ్లము వంట తింటే ఒకతంటా తినకపోతే ఒక తంటా.

'కొత్త పెండ్లము వండు
గొడ్డుకారము మెండు
తీపియును పోస్పెండు'

అప్పు నిప్పులాంటి దంటాడు. కనిపించకుండా బాధను రగిలిస్తుంది.

'పెరుగుచుండే అప్పు
కరచు చుండే చెప్పు
కాను పించని నిప్పు.'

కవసాహిత్యం వల్ల ప్రయోజనం కల్ల.

'పేజి పేజికి వధలు
ప్రజలు వొల్లని కథలు
ఆరగించును చెదలు.'

సెక్సువ టాక్సులే దంటాడు.

'పెరిగె ఇన్ కమ్ టాక్సు
పెరిగె సూపరు టాక్సు.
టాక్సులేనిది సెక్సు.

అహంభావం అనర్థదాయకం అంటాడు.

'ఆశ పెరిగిననాడు
అహము పెరిగిన నాడు
తనకు తానే కీడు.'

ఈ సంపుటినిండా నీతులు, హాస్యపుజల్లులు పుష్కలంగా ఉండి సులభగ్రాహ్యంగా ఉన్నాయి. ప్రతివారు చదవవల్సిన ఉత్తమ కవిత్వం ఇది. మంచికాలక్షేపానికి ఇదొక మంచిపుస్తకం. వచ్చే వ్యాసంలో రసిక్ గారి 'కూనలమ్మపదాలు' ముచ్చటించుకుందాం.

# ఒక చిలుక ముక్కులో ఇరవై ఇంద్రధనుస్సులు

— శ్రీ సోమసుందర్.

తపస్సు ఒకనాటిది కాకపోయినా ఫలశ్రుతి సిద్ధించడం ఒక్కక్షణంలో జరగవచ్చు. అలాగే కవి దర్శనం ఒకనాటిదికాదు. అనారతం అతనిహృదయం ద్రష్టగా లోకాంతరాలలోనికి తనచూపులు పరపుతూనే ఉంటుంది. కాని ప్రదర్శన మాత్రం ఏదోఒక ముహూర్తకాలంలో జరుగుతుంది. అదిఎన్నో రోజుల ఫలశ్రుతిగా బయటపడుతుంది. కవికి ప్రదర్శనశక్తే ప్రధాన ప్రకృతి. ఈ శక్తి క్షేమేంద్రంలో అపారంగా అభివ్యక్తమైంది. దశాబ్దాలుగా సంస్కృతమైన అతని హృదయ నిక్షేపమే దానికి కారణం. అనుస్యూతమైన వ్యుత్పన్నతతో పెంపొందిన ప్రతిభాసమున్మీలన మది.

ఈ ప్రదర్శన శక్తిలో సైతం స్పెయిన్ జాతీయకవి గర్షియాలోర్కాతో క్షేమేంద్రకు సాదృశ్య మేర్పడుతుంది. "Lorca within the frame work of his own poetic inventions, only hints "over the flower of gold, dirty sand" అని ఎడ్వర్డుహానోనిగ్ తన లోర్కాగ్రంథంలో (పు 195) చెప్పిన మాట క్షేమేంద్రకూ అన్వయిస్తుంది.

'Poet must use his consciuosness to deny the easy dualism of mind and body, reason and emotion, intellect and instinct' (I bid P. 191) ఈ వైచక్షణ్యమేగాక, ఈ మానసిక సాహసమూ ఈ కావ్యంలో ప్రత్యక్షమవుతుంది.

'I be queath myself to the dirt
to grow from the grass I love
If you want me again look for me
under your boot-soles.'

అంటాడు అమెరికన్ జాతీయకవి వాల్ట్ విట్మన్. అలాగే క్షేమేంద్ర తననితాను భూమిలో కలుపుతా నంటాడు. రక్తాన్నీ మట్టినీ పద చిత్రంచేసి ప్రయోగించిన కవులు చాలామంది ఉన్నారు. అయితే ఒక్క సామాన్య పదచిత్రం వెనుక ఎవరి సంస్కారం వారిదిగా పలుకుతుంది. ఎవరి విశ్వాసాలు వారివిగా ప్రతిబింబిస్తాయి.

'I will show you fear in a handful of dust' అన్న ఎలియట్ కవివాణిలో వర్తమాన జీవన నిరసన, విరక్తి, జీవిత బీభత్సమూ ద్యోతకమవుతాయి. కాని ఆశావాదీ, సామాన్య జనతతో తాదాత్మ్యం ప్రదర్శించుకొన్న పురోగమనశీలి, ఐన లోర్కాకవి ఇలాంటి విరక్తినీ సౌందర్య తిరస్కారాన్నీ ప్రతిధ్వనించడు. అత నిలా అంటాడు :

'And my blood
On the field be sweet red mad
Where weary peasants
May sink their spades.

జీవన బాధ్యతా స్వీకారాన్ని ఆవిధంగా అభివ్యక్తం చేస్తాడు లోర్కా; క్షేమేంద్ర కూడా, 'నేనింకా ఒక పిడికెడు మట్టికావచ్చు కానీ కలమెత్తితే

నాకు ఒక దేశపు జెండా కున్నంత పొగరుంది. కష్టాన్ని, కన్నీటిలో ముంచుకొని బిస్కెట్లలా తింటాను. బ్రతుకంటే బలవంతుడైనవాడే శబ్దంనుంచి శతాబ్దం వరకూ మలిచే శిల్పి అని ఆవిష్కరిస్తాను. (పు. 10)

నేటికీ మృణ్మయాకృతిగా ఉన్న సామాన్యుడు కంఠమెత్తితేచాలు, ఒక దేశస్వేచ్ఛాప్రతీక అగు పతాకగా మారిపోతాడు. గర్వంగా ధైర్యంగా రెపరెపలాడతాడు. నేడా వాడు కష్టాన్ని కన్నీటిలో ముంచుకొని తింటున్నవాడే కావచ్చు. కాని అతడు బ్రతుకు కంటె బలమైనవాడు. కనక మృత్యువునీ ధిక్కరించగలడు. బ్రతుకును చూసి భయపడిన వాడే మృత్యువుకు దూరంగా పారిపో ప్రయత్నిస్తాడు. ధైర్యశాలి మాత్రమే శబ్దంనుంచి శతాబ్దంవరకూ మలచగల సశక్తశిల్పి. అదీ అతని కవిత్వసాంకేతిక హ్రస్వలిపి.

అలాగే - 'శబ్దాలగుండె పగిలి ప్రవహిస్తున్న ఆగ్నేయ రక్తంలో మనుష్యుల నాల్కలు తేలుతున్నా' యంటాడు. శబ్దాలగుండెలు పగులగా రక్తం ప్రవహించింది. అది ఆగ్నేయరక్తం. సలసల మంట లెగజిమ్ముతున్న లావావంటి నెత్తురు. అందులోంచి ఎర్రని నాల్కలు తేలుతున్నాయి. శతాబ్దాల వరకూ సరిపోయే నూత్న మానవధర్మాన్ని శాసింపగల అభిభాషణ లవి. సాధారణ పదాలతో అసాధారణ పదచిత్రాలను రూపొందించి ప్రాణప్రతిష్ఠచేసే ఉత్తమనైపుణ్యం. ఇదే ఆధునిక కవితకు జీవలక్షణం.

దీని నే ప్రస్తుతిస్తూ శ్రీమతి ఇందిరా రాజ్ గిర్ యిలా అంటారు: a fantasy flooded the whole room with violent hair raising, deeply disturbing images fell so earth and there the poem rose in graceful arabis ques.' అన్న ఉగ్గడింపు - కేవలం ,సత్యసందర్శనమే కాని అన్యంకాదు. కనుకనే నాకిలా అనాలనిపిస్తుంది. 'Seshen's experiments are not an attempt to escape from literature against traditional poetic in heritance.' అని!

వర్తమానం అంధకార బంధుర కాళరాత్రి.అదియిళ్ళవడి కొప్పాల కెక్కి మొరుగుతోంది. కుక్క యిల్లెక్కి మొరగడం అరిష్టసూచనగా మనవాళ్ల విశ్వాసం. పెండ్యులం ఊయెలలో కాలం శిశువులా నిద్రిస్తోంది. అదీ ఈ కావ్య ప్రారంభం. ఆరంభవాక్యాలతోనే ఒక అపూర్వ వాతావరణంలోనికి మన హృదయాన్ని ఆకర్షిస్తుంది. అట్టిసమయంలో ఒక గీతి ఉద్భవించిందట! కాని అది రెక్కలు రాగానే ఆకాశంలోని కెగిరి పోయింది. తెల్లవారుతూనే కిటికీ అద్దాలకు ఎర్రటి మరకలు పూసింది. రాగల విప్లవాన్ని సందేశించింది. అప్పుడు గొరిల్లా మేలుకొన్నాడు. 'అవ్యక్త భవిష్యత్కాననాంతరాలలో భయంకర ఆకారరేఖలా గొరిల్లా లేస్తోంది. మానవుని నరాల నెత్తుటి దారుల్లో అవక్రంగా విజృంభిస్తోంది. మదోన్మత్త మారుతాలతో తన మెదడుకు మేతవేసే గొరిల్లా గాండ్రిస్తున్న ఆకాశంలో నవయుగీన కంఠం' మానవుడు విన్నాడు. కాని అతడింకా కర్తవ్యోన్ముఖుడు కాలేదు మరో ప్రక్కకు పొర్లిపడుకున్నాడు.

ఆద్యంతమూ ఈ కావ్యం ఒకసామాజిక చైతన్యావరణంలోనే పలవిస్తుంది. ఈ కావ్యంలో ప్రయుక్తమైన 'నేను' వ్యక్తిగత అహానికి ప్రతీక కాదు. సామాజిక అహానికి మాత్రమే సంకేతం. శ్రమజీవులతో అవిరళానుబంధాన్ని నెరపుతుంది కవివాణి. కవి తానొక మనః కార్మికుడ ననే స్పృహను ఎక్కడా కోల్పోడు. 'ఉషస్సు కళ్లు తెరిచేసరికి దానికి కనిపిస్తాం - ఒకగుడ్డి లాంతరు ముందు కూర్చుని పనిచేస్తున్న నేనూ నా కవిత్వపు పనిముట్లూ...' కవి మామూలు శరీరశ్రమచేసే కార్మికుడు కాడు. పనిముట్లు ఉపయోగించగల స్కిల్డులేబరు... సామాన్యుడు ఆరుగాలం పని చేస్తే, అతను కష్టించి సాధించిన తిండిని చివరి కతనిపిల్లలకు దక్కకుండా చేస్తోంది వ్యవస్థ. కనుకనే ఆరవ సర్గలో -' నా పిల్లలచేత నాతిండి తినిపించక పోతే నేను వాడిరక్తం భూమిచేత తాగిస్తా! నా కవిత్వం ఏ జెండానూ ఎగరవేయదు కాని నాచేతులు నాదేశపుఖడ్గాలు...' (పు. 20)

తాను సామాజిక కవి, జాతి సంధించే చైతన్యధార, కనుకనే సోదర కవుల నిలా హెచ్చరిస్తాడు.

'ఓకవీ! నీ పద్యాన్ని
యుద్ధానంతర శస్త్రాల్లా
అప్పుడే గోడకు తగిలించకు
నీతుపాకుల్లో పెద్దపెద్ద
శార్దూలాలూ మత్తేభాలూ పేరి
సంసిద్ధంగా ఉంచుకో!
నీమాటల దేశాన్నించి
మత్తకోకిలల్ని బహిష్కరించు.
రాబోయే ఇతిహాసం కోసం
నీ శబ్దాలు నూరి పదును పెట్టుకో!
వాడి గుండె ఎన్ని తుపాకుల దూర
ముందో కనుక్కో!

ఐదవ సర్గలో (పు. 14)విరామ చిహ్నాలు లేకుండా, వచన వాక్యాలవలె కొనసాగిన పై ఉల్లేఖనంలో పాదవిభజన, విరామ చిహ్నాలూ నేను కల్పించిన రూపం. దీని భౌతిక స్వరూపం ఉత్త వచనంలా కనిపించినా, ముక్తచ్ఛంద కవితాస్వరూపమే అని నిరూపించడానికే ఈ రూపంగా ప్రదర్శించాను. పై వాక్యాలకు వ్యాఖ్యానం అపేక్షణీయం కాదు; సద్యస్స్ఫూర్తిగల అభినవోక్తి!

సహృదయ హృదయావేశాన్ని ప్రోది చేయ వలసిన వర్తమానకవి – సంశయ కల్లోలంలో కొట్టుమిట్టాడు ఔపదేశికత జోలికి పోతే కవిత్వం మైలపడిపోతుం దనుకుంటున్న కొందరు – శూన్యవాదాల శుష్క విచికిత్సలో తలమునకలు పెడుతు న్నారు. శుద్ధ కవిత పేరుతో కొందరు లౌకిక ధర్మాలను అస్పృశ్యంగా విడిచి పెడుతున్నారు. మరికొందరు శవారాధ కులై ఆవకాయ మీద, ఆకలి మీదా అ కవిత్వ రోదనం సంధిస్తున్నారు. ఇట్టి స్థితిలో కవి చైతన్యవంతుడై పురోగ మించడం అవసర మని గొరిల్లాహృదయం ఆక్రోశిస్తుంది. కవి సైనికుడై ముందంజ వేయా లని భావించబడుతుంది !

ఎనిమిదో సర్గలో – 'నాకు తెలుసు నీ మెదడులో మరోప్రపంచం ఊపిరిపీలు స్తోంది. నీహృదయం మంచిదైతే నీ పెద వులమీద పుస్తకాలు పూస్తాయి. కాలె త్తితే నీవు ఏ దేశాల్లో అడుగుపెట్టలేవు ? పని చేస్తుంటే నీచేతులు ఎంత అందంగా ఉంటాయి ! నీ కన్నుల్లో ఎన్ని ఆశ యాల సౌందర్యబలం సాక్షాత్కరి స్తుంది ?' (పు. 26)

నిజమే, సామాన్యుని మెదడు మరో ప్రపంచలో ఊపిరిపీలుస్తోంది. శ్రీశ్రీ గారు పిలుస్తోం దని మనకి చెప్పిన మరో ప్రపంచమే కాదు ; వర్గాల ఎగుడు దిగు డులు లేని సుందరసమతల వ్యవస్థ హృద యగతమైన ఆ మరోప్రపంచపు రమణీ యాకృతి – స్వప్నసీమలనుంచి దిగి, యథార్థ స్వరూపాన్ని సంతరించు కోవాలి. మానవుని సంకల్పం మంచి దయితే అతని పెదవులపై సత్కృతులు పుష్పిస్తాయి. పనిచేస్తున్నపుడే అతని చేతులు అందంగా ఉంటాయి. అతని కనుల్లో సదాశయాల దీపతోరణాలు మెరుస్తాయి. డిగ్నిటీ ఆఫ్ లేబర్, పురుష కారసార్థకత, సత్ హృదయ సంస్కారం– అవీ మనిషిగౌరవించవలసిన త్రికరణాలు!

తొమ్మిదోసర్గలో – 'తుపానుల గర్భ వాసాన పుట్టినవీరుడు ఒక చిన్న పొద మాటున దాగి ఉండడు ... ఆదిమశక్తు లన్నిటికీ ఆలయమైన విరాట్ పురుషుడికి యావత్ మానవజాతీ తన కార్యరంగం...' సామాన్యుడు యుగాల నైరాశ్య తమస్సుల కలవాటు పడ్డవాడు. ఉన్న సుఖమే గొప్ప దనుకునే పిరికిగాతయారై అలవాటుగా బ్రతుకుతున్న వాడు. కాని అతని రక్తనాళాల్లో ఎంతగొప్ప వార సత్వం సుప్తమై ఉందో అతనికి తెలి యదు. ఎంత మహత్తర కార్మణికోత్సా హం ప్రదర్శించగలడో అత డెరుగడు. స్వస్వరూపజ్ఞానం లేకపోవడమే దానికి కారణం ; దానికే కవిత్వం బయటకు చేదాల్సివుంది. లేనిదాన్ని అందించలేదు. ఉన్నదాన్ని హృదయోపరి తలానికి చేర్పడమే !

పదకొండో సర్గలో 'మానవజ్వాలల్లో నుంచి గొరిల్లాను ఆవాహన చేస్తాను. ప్రజలమీద ఇంద్రజాలం ప్రయోగించి వాళ్లని అగ్నిపర్వతాలుగా మారుస్తాను. నేను విశ్రాంతిని దున్నను. కలలను చల్లను !' అంటాడు. (పు. 40)

సరిగ్గా యిలాగే మరొక విస్కీ కూడా ఒక కవితలో సూర్యుని ఆవాహన చేస్తాడు. ఆద్యంతం ఉపాసిస్తాడు. సూర్యుని క్రిందికి దిగి రమ్మని, సకలకాలు ష్యాలతో నిండిన చీకటి కోణాలను భస్మీ పటలం చేయుమనీ ఆహ్వానిస్తాడు. సూర్యుడు భూమికి దిగివచ్చి తనను దర్శిం చాలంటాడాకవి. అప్పుడు సూర్యుడు చేయవలసిన పనుల జాబితా అందిస్తానం టాడు. కవి ఆజ్ఞకు లోబడి సూర్యుడు దిగి వస్తాడు. కవితో ముచ్చటిస్తాడు. అదీ ఆ కవితాస్వప్నం! ఆ కవితలోని ఫ్యాన్సీఅది. జాగృత మనోవీథిలో సంచరించిన సుందర స్వప్న మది!

నిరంతర సృజనాత్మక శక్తితో కవి హార్దిక యౌవనాన్ని సంరక్షించుకుంటూ పురోగమించాలి. ఆరంభ యౌవనుని ఆవే శోద్రేకాలు, దివాస్వప్నాల కాల్పనిక సుందరారామాలూ అతని హృదయంలో ఆకు పచ్చగా ఆవాసం చేస్తాయి. పిలిస్తే పలుకుతాయి. కవికి ఈ భావుక తారుణ్యం పసిచెడకుండా తాజాగా ఉండాలేతప్ప– వయః పరిమితితో నిమిత్తం లేదు. ఎప్పు డైనా ఎక్కడైనా ఆ రసమయ బాల్యం అతని పిలుపుకై సంసిద్ధంగా వుంటుంది. కవి హృదయం మద్యం వంటిది. వయో వృద్ధితో పాటు శక్తిని ద్విగుణీకృతం చేసు కుంటూ ఉంటుంది. ఆ భావుక తారుణ్యం కోసమే–కవికి మూఢవిశ్వాసాలు దరికి రాకూడదు. పౌరాణిక తిరోగమనం– ఈ రసమయ బాల్యానికి పరమశత్రువు. చాద స్తాల దస్త్రాల క్రింద పడి ఈ తారుణ్యం నలిగి చస్తుంది.

సూర్యుణ్ణి ఆజ్ఞాపించగలిగిన మరొక విస్కీ తారుణ్య భావుకత్వం లాగే– శేషేంద్ర కవితా హృదయం గొరిల్లాను ఆవాహన చేస్తుంది. వానరత్వం నుంచి నరత్వ మనే ఉచ్చస్థితికి, కార్మణ్య త్వంతో పురోగమించిన అంతర్దశకు గొరిల్లా ప్రతీక. పురుషకార మూర్తీభావ మది. కర్తవ్యోద్దీప్తుడై స్వార్థపరుల బారి పడిన మానవాత్మను అన్వేషించిన హను మంతుడే నిజానికీగొరిల్లా! కాని గొరిల్లాకు బదులు– "హనుమంతా" అనే సంబోధ నతో ఈ కావ్యం నింపబడితే– హైందవ మత సంబంధమైన పాక్షికత్వాన్ని భజి స్తుంది. అప్పుడా మూర్తికి సార్వజనీనత రాదు. అంతర్జాతీయ సౌలభ్యం సిద్ధించదు. గొరిల్లాకు–ఎల్లలూ, దేశాల యిరుకు సరి హద్దులూ లేవు.

శేషేంద్ర కవిత భౌతిక దృష్టికి శుద్ధ వచనం లాగే భాసిస్తుంది. నోటిలో వేసు కుంటే తప్ప అది ఉప్పో పంచదారో తెలి యదు. స్థూలదృష్టికి ఉప్పూ కప్పూరమూ

ఒక్క పోలికగానే ఉంటాయి. అనుభవిస్తే అది శుద్ధవచనం కాకపోగా, పరిశుద్ధ కవిత్వ మని తేటతెల్ల మవుతుంది.

ఈ కావ్యాన్ని ఆధునిక ముక్తచ్ఛంద స్వరూపంలో పాద విభజనచేసి అచ్చువేయనందుకు చాలమంది కుశంకలు లేవనెత్తారు. రన్ ఆన్ ప్రోజ్ లా కవిత్వాన్ని రాయడ మనే లక్షణం కూడ ఆధునిక మేనని వారికి తెలియదు. విప్లవకవి సిజెయురీగాని రేంబో (Jean Nicolos Arthur RIMBADU) ఇదే సంవిధానంతో ఉత్తమ కావ్యాలెన్నో రచించారు. తెలుగులోకూడ ముప్ఫయ్యేళ్ళుగా ఈ ప్రయోగం గ్రంథస్థ మవుతూనే ఉంది.

రేంబో రచించిన "LES Illuminations" అనే సుదీర్ఘ కావ్యంనుంచి ఈ భాగాన్ని పరిశీలించ మని కోరుతున్నాను.

"అడవుల అంచులలో స్వప్నసుమరాశి నిక్వణిస్తుంది. ప్రకాశిస్తుంది. వనజ్వాలగా భాసిస్తుంది. ఆకుపచ్చని పెదవుల బాలికలు...పొంగే వరదనీట అస్తవ్యస్త పాదాలతో, ఆసీనమైన బాలికలు ...పచ్చికబయళ్ళ నగ్నసత్యాన్ని ఆచ్ఛాదిస్తూ...దిగంతరేఖల నావరించుకుంటూ.. హరివిల్లుల చీరలతో అలంకరించుకుంటూ ... వనదేవతలై మెరుస్తూ ... ఉదధిలా ఉప్పొంగుతూ... " (అనువాదం ఈ రచయితది.)

ఇది ఆంగ్లానువాదంలో అరవై పుటల కావ్యం. విరామసంకేతా లెక్కడో కాని ఉండవు. శ్వాసల కోసం ఫుల్ స్టాపుల కోసం కలవరపడిపోయేవాళ్ళ చూపు ఎంత సంకుచితమో, ఇతరేతర కావ్యజాలం అధ్యయనంచేస్తే తెలుస్తుంది. వచనం నడుములు విరిచి పాదాలుగా పేర్చి కవిత్వంగా ప్రదర్శించే అసంఖ్యాక అపక్వ రచనలకన్న – కవిత్వ పరిమళాలను అడుగడుగునా ప్రసరించే శుద్ధవచన స్వరూపం మిన్న కదా! ఈ గోరిల్లా కావ్యంలో ఆలంకారికముద్ర పరిపూర్ణంగా ఉంది. అంతర్లయ, అనుప్రాసాది భౌతికసంపద తగినపాళ్ళలో లేకపోలేదు. కాని అర్థాలంకారసమన్వయము పొందని వాక్యమే దాదాపు కనిపించదు.

Rhythms విషయంలో శేషేంద్రకు మయొకో విస్కీ వారసత్వ మెంతో లభించింది. మయొకోవిస్కీ రిథమ్స్ గురించి వివరిస్తూ — లునాఛరిస్కీ యిలా అంటాడు: Mayakovisky's rhythm is the rhythm of argument; the rhythm of an orator's appeal, the rhythm of industrial sounds, industrial production metres and rhythm of march· (P. 243, 244) కనక మనం భౌతిక స్వరూపం గురించి మళ్ళీ యిన్నాళ్ళకు ఏదోరూపంగా పేచీపడడం మంచిది కాదు.

పన్నెండో సర్గలో – "వ్యభిచారులైన దేవుళ్ళను పూజిస్తారు. నీతిపరులైన మనుషుల్ని చంపుతారు. గాలిని దేశాలుగా, నీళ్ళని జిల్లాలుగా విభజించి పంచుకుంటారు. నేలను బట్టలా కొలిచి పెట్టెల్లో పెట్టుకుంటారు మూర్ఖులు ... "(పు. 42) ఇదీ వర్తమానస్థితి; సమాజంలో చెలామణీ అవుతున్న విలువలు. చలంగారు రీలోకంలో నీతిగా చెల్లుబడి అవుతూన్న అవినీతిని చూసి ఆక్రోశించిన తావుల్లో ప్రదర్శితమైన కవితాగ్రహం వంటిదే ఆ వేశపూరితంగా ప్రతిబింబిత మవుతుంది.

పదిహేనవసర్గ ఆసాంతం మననం చేసుకోవలసిందే. భావుక హృదయంలో ఎన్ని ఉత్తుంగతరంగాలు విజృంభిస్తాయో అంతర్ముఖులై గమనించవలసిందే. "నాగళ్ళూ తుపాకులూ పట్టుకొనే యినప హస్తాలు నాయకుడి కాళ్ళు పట్టుకుంటున్నాయి, కబంధుడికాళ్ళు. పాలు పితికి పసినోళ్ళలో పోసే చేతులు రాత్రులన్నీ పిండివెన్నెలతో వాడి పాదాలు కడుగుతున్నాయి! ...... అసెంబ్లీలు మనమే కడతాము. జాతికీర్తికి మనమే గాలి గోపురాలు లేవుతాము. వాడ్ని కుర్చీలో కూర్చోబెడతాము ... మనం వాడి ఇటుకల క్రింద పడి చస్తాము..." ఇదీ మన దయనీయస్థితి.

This is not in the leait of scientific realism, an objective record of fact, such as parnassions loved, but an imaginative realism which allows no frontiers to the poetic spirit but assumes that it may find its meterial in any brarch of life. — అంటాడు సి. ఎమ్. బౌరా. (Creative experiment Page 10- ) పై వాక్యం శేషేంద్ర ఉద్ఘాటనలోని ఆంతరిక వాస్తవికతకు అన్వయించుకుంటే – దాని ఉదాత్తత అవగాహన కాగలదు.

గోరిల్లాలో అడుగడుగునా వక్రోక్తి వైభవం సాక్షాత్కరిస్తుంది. దాని కెన్నో

(తరువాయి 19 వ పేజీలో)

# విశ్వనాథతో ఇష్టాగోష్ఠి

— శ్రీ వసుంధరా సుదర్శనులు.

## భగవద్దర్శన లక్షణం

వి: ఏదైతే మనస్సు, ఆత్మ, బుద్ధి అను )న్నభిన్నమైన దశలలో మనము వీటిన ౖటిని భావిస్తున్నామో, యీ భావించ ానికి ఏశక్తి అయితే మూలకారణంగా ుందో ఆమూలకారణమైన స్వచ్ఛమైన ుహజమైనశక్తికి చాలదగ్గరది యీ సౌం ర్యపిపాస. ఎంచేతనంటే విషయ సం ంధి కాదు అది. ఆ సౌందర్య పిపాసని ేరుకోనేకొద్దీ, the deeper and leeper you go into the 'ery secret of the thing, hat energy, that power nanifests itself.

వ: అదేనండి నేనడిగింది. Different waysలో యిక్కడ manifest అవుతున్నదాని మూలం దగ్గరకు ూరు పోతూరా! అని,మనస్సులో వెనక్కి వెనక్కి వెళ్ళగా-భగవద్దర్శనం అయిందా అని. Postive గా భగవంతు డున్న ట్టుగా మీకు రూఢి అయిపోయిందా?

వి: నాకా? నాకు సందేహంలేదు.

సు: సందేహం లేకపోవడం ఒకటీనూ నిపించటం ఒకటీ కదా, చాలా మందికి ిశ్వాసం వుంటుంది, వున్నాడు అని. కాని ూ అనుభూతి ఎంతదాకా వెళ్ళింది?

వి: నా అనుభూతిని గురించి మాటా ితే కొన్ని చెబుతాను మీకు. నేను అద్వైతిని. అద్వైతి అంటే అహంబ్రహ్మాస్మి అనొచ్చు. బ్రహ్మ అంటే పరమచైతన్యం అని అర్థం. ఈ చైతన్యం యొక్క ఉప ుక్షకంను సచ్చిదానందం అంటారు. కాని ి బ్రహ్మ అనేది ఎక్కడున్నదంటే సర్వత్రా అభివ్యక్తమై వున్న దని. ఇం ములో అనేకములైన శాస్త్రపు తగాదాలున్నై. ఇందాక మనం అనుకున్నట్లుగా దీనికి యీ పాంచ భౌతికమైన శరీరం ఎలాగో, భావ సంబంధమై నటువంటి manifestations వున్నారు- Gods.

సు: ఒక్కొక్క భావానికీ ఒక్కొక్క కల్పన.

వి: ఆకల్పనచేత వాడు దేవుడౌతు న్నాడు. ఇందాక సౌందర్యాన్ని భావన చేసినకొద్దీ ఆ స్థితికి పోతారన్నట్లుగా- ఆ సౌందర్యంకూడా వట్టి భావనాకల్పన యేగా, దాన్ని త్రవ్వినకొద్దీ యథార్థ స్వరూపావభాసం కలుగుతున్నదంటు న్నాంగా, అట్లా మనం కల్పించుకున్నట్టి భావమయమైన రూపజగత్తులో వున్నటు వంటి దేవతలను భావించినకొద్దీ (వాళ్ళకు రూపం కల్పితం, పాంచభౌతికం కాదు, మనోమయమైన రూపాలవి. కాని వాటి క్కూడా stability వుంది.) వాళ్ళు కన్పి స్తారుతప్ప, మన ధ్యాన నిష్ఠచేత రూపం లేని బ్రహ్మపదార్థం ఎట్లా కనిపిస్తుందీ?

సు: కన్పించదుగా. ఉండేది 'నేను' అనేంతలో నిలిచి పోతుంది.

వి: ఇది కనిపిస్తుంది. నాకు continuous గా లేదుగాని నాకు నాలుగైదు అనుభవాలున్నై.

సు: వరంగల్‌లో వారికి కలిగిందట. వీరి తమ్ముడు వెంకటేశ్వర్లుగారు పూజ చేసుకునే గదిలో వీరు కూర్చున్నారు. ఆయన ధ్యానించేది అమ్మవారిని. వీరు రాముణ్ణి. వీరు కూర్చొని జపంచేసుకుం టుంటే ఒకావిడ బింది చేతిలో పట్టుకుని యీయన్ని 'నిన్ను కొడతాను చూడు' అన్నట్లుగా బెదిరించినట్లుగా కనిపించిం దట. కనిపిస్తే వీరేమీ చలించలేదు. తర్వాత తమ్ముడితో అంటే...

వి: ఆ దేవీరూప భావనానిష్ఠమైన ఒకరూపం అక్కడ సృజింపబడిందన్న మాట. మనం ఎనభై ఏళ్ళు తొంభై ఏళ్ళు ఎలావుంటున్నామో ఆవిడ అట్లాగే వుం టోంది.

సు: ఇప్పుడీ దేవీరూపాలన్నీ అలాగే నన్నమాట.

వి: అంతేగా మరీ. ఇంకా నాకు...

వ: మీకు ధ్యానంలో కన్పించే దనేది Physical గా కన్పిస్తుందీ?

వి: వాళ్ళకు Physical రూపాలు లేవుగా!

సు: అంటే యించుమించు కళ్ళు తెరుచుకునే వున్నట్లు వుందట.

వి: ప్రత్యక్షమైనాడు భగవంతుడు అని అందరూ అనేది రామునియొక్క మానసికమైన కల్పిత రూపమేతప్ప...

వ: కల్పితమైన రూపమే Physical గా కన్పించిం దనేగా.

వి: Physical గా కన్పించటం గాదే Physicalగా కన్పించటం ఎప్పుడూ లేదు.

వ: తానీషా కెవరండీ కన్పించింది?

వి: ఇట్లాంటిదే. తేజోమయమైన రూపం.

సు: అప్పటి కాక్షణంలో అతని కని పిస్తుంది ఇంతకు మించిన యదార్థం లేదని.

వి: Wrong use of the word 'Physical' Physical కాదు కన్పించింది. physical-like గా వున్నది. Physical అయితే మనిషి రావటం, వెళ్ళటం జరుగుతుంది. Physical అంటే పాంచభౌతికం.

వ: మరి యిక్కడికి ఎవరైనా వచ్చి వెళ్ళారా అని ద్వారపాలకుల్ని అడగటం జరిగింది కదా.

వి: అవన్నీ feelings. అలా strike అవటం.

సు : స్వప్నానుభూతి కూడా జరుగుతున్నంతసేపూ అదే నిజంగా వుంటుంది గదా. అలా యథార్థభావన అన్నమాట.

వి : మనకేకాదు ఆ భావన. ప్రక్కనున్నవాళ్ళకు కూడా అదే భావన కలుగుతుంది.

సు : ఇద్దరు ముగ్గురికి కూడా కలగవచ్చు.

వి : అందులో వున్న శక్తియొక్క ఆధిక్యంచేత కలుగుతుంది.

వ : అప్పుడు భగవంతుడి అవతారం అంటే అర్థం ఏమిటండి ?

వి : మనం మళ్ళీ జన్మ ఎత్తడం అంటే అర్థమేమిటి ?

వ : మళ్ళీ జన్మ ఎత్తడం అనేది మన convenience కోసం చెప్పుకున్నదే గదా.

వి : కాదమ్మా. వెనక మనం past births, ఆ కర్మయొక్క ఫలితం, జీవలక్షణం చెప్పాం కద.

వ : ఎందుకన్నామంటే భగవంతుడు నిర్దయుడు అనుకోవటం యిష్టంలేక అన్నాం అంటేకదా.

వి : బాగాలేక అని మనం అన్నది కట్టి తర్కంతో చెప్పినమాటేకాని ఆ births నిజమేగా. భగవంతుడనేవాడున్నాడు, వాడిట్టి సృష్టిచేకాడు అనే భావనకూ అద్వైతమతం వున్నదనే టటువంటి భావనకు రెండు భేదాలు వుంటూ వుంటే, advanced thinking లో ఆ భగవంతుడిలో వున్నాడంటూ వున్న composit భగవంతుణ్ణి మనకు ఎవరూ చూపించలేరు గనుక, అతని existence వూహించదగినదే తప్ప దర్శించదగినది కాదు గనుక, ఆ దర్శించడం ఎవడో యోగి దర్శిస్తున్నాడే తప్ప all people యొక్క physical eyes కి కనిపించదు గనుక...

వ : యోగియొక్క physical eyes కి కనబడ్డాడా ?

వి : చెప్తా. యోగికి కన్పిస్తున్నాడంటే వాడియొక్క mental శక్తి ఎంతటిదంటే, వాడు create చేస్తున్నాడు ఆ దేవుణ్ణి అక్కడ. అంచేత వాడి దృష్టిలో ఆ ఆకారము మానుషాకారము కలిగినటువంటి ఒక రూపము. ఆరూపం permanent అవుతోంది వాడికి. ఆ permanent అయిన రూపం వాడు చూస్తున్నాడు. వాడు భగవంతుడంటున్నాడు. వాడికి కనిపిస్తున్నది. మనకు అంత concentration గాని అటువంటి సంస్కారం గాని లేనుగనుక వాడు మనకు కనబడ్డంలేదు. మనం ఎట్లాగైతే యీ physical దేహంలో అన్ని physical bodies కి కనిపిస్తామో అల్లా వాడిచేత కల్పించుకోబడ్డటువంటి ఆ మానసికమైన రూపం వాడికే ప్రత్యక్షంగాని మనకు కాదు. ఆ భగవంతుణ్ణి యితరులకు మనం చూపించలేము. అందరూ చూడలేరు.

సు : చూచేస్థితి వున్నపుడు యింకా రెండుగా వున్నదికదా. ఇంకా ఆ అద్వైతస్థితి రానట్లేకదా.

వి : అది వేరే argument ... రాలేదన్నమాటే. అక్కడదాకా పోతాడు. ఈ సౌందర్యమే వెళ్తుందని చెప్పాను కదా. వాడి సౌందర్యం వేరాయె. వీడి సౌందర్యం వేరాయె. కనక వీడి కల్పన వేరు. వాడి కల్పన వేరు. కాని ఒకానొక commonness వున్నదాయెను.

సు : అందుకే యిష్టదైవం అనేది కూడా వస్తుంది. వీరి యిష్టదైవం వేరు. వారి యిష్టదైవం వేరు.

వి : వాడి nature లోనే అమ్మవారంటే భక్తి వాడికి. వీడి nature లోనే రాముడంటే భక్తి. శివుడంటే భక్తి. కాని యీ projection చేసేటటువంటి groups of men చాలమంది వున్నారు గనుక ఆశివుడొకడున్నాడు. ఆవిష్ణుడొకడున్నాడు.

సు : అని లోకవ్యవహారంగా ఏర్పడింది.

వ : అవతారాలనేవి నిజంగా జరిగినవి కావా ?

వి : దానిమీద వేరే మళ్ళీ పెద్ద question వుందమ్మా. నేనుదీన్ని గురించి ఒక పెద్ద పుస్తకం వ్రాద్దామనుకున్నాను గాని వ్రాసి చూపలేదు.

వ : యోగికి భగవంతుడు నిజంగానే వున్నట్లు కన్పిస్తాడు గదండి.

వి : అవును.

వ : అప్పుడు యిది physical కాదు అనేమాట అతని idea కి రాదు. అదే truth గా కనిపిస్తుంది. నేనడిగినప్పుడు నిజంగా physical గా కన్పించడానికి వీల్లేదని మీరు చెప్పారుకదా.

వి : physical గా అంటే యీ పాంచభౌతిక శరీరంలో అని నా ఉద్దేశం.

వ : అప్పుడు యోగికి యీ ప్రపంచం కనపడే తీరు, భగవంతుడు కనపడే తీరు different గా వుంటుందా ?

వి : అవును.

వ : ఇది కనిపించినంత real గా అతను కనపడడా ?

వి : కనబడడమంటే కన్ను ముయ్యటం, కన్ను తెరవటం, కన్ను తెరిచినప్పుడు కనిపించేది యీ physical world. కన్నుమూసినప్పుడు యీ physical world యొక్క ఆకారాన్నికూడా కల్పించుకోవచ్చును. భర్త నమితంగా ప్రేమిస్తున్నది. కళ్ళుమూసుకుంటే ఆ భర్తరూపం కనిపిస్తున్నది. ఆ రూపం భౌతికమా ? కాదు, భావనామయమైనది. సరిగ్గా ఆ పరమేశ్వరుని విషయంకూడా ఆ భావనామయమైన రూపమే కనిపిస్తుంది. ఇంకోటి కనిపించదు.

వ : కనిపించటానికి వీల్లేదుఅంటారా?

వి : చూడటమనేది రెండుగదామ్మా చర్మ చక్షుస్సులతో చూచేది వేరు. భావనానేత్రములతో చూచేది వేరు. ఇట్లా వుండగా యింకోతగాదాకూడా వుంది యిందులో. భావనామయమైన నేత్రములతో చూచే ఆకారము ఒకానొక సాధనావిశేషముచేత చర్మ చక్షువులకుకూడా కనిపిస్తుంది.

### విశ్వనాథ అనుభవసిద్ధి.

వ : నేనదేనండి అడుగుతూ వుండేది. మీకలా కనపడ్డదా అని.

వి : ఒకొక్కప్పుడు కన్పిస్తుంది. వాడికి చర్మ చక్షుస్థితి, భావనా చక్షుస్థితి అవినాభావం పొందేటంత concentration వస్తే అప్పుడు చర్మ చక్షువులకు కూడా రాముడు కన్పించి వుంటాడు.

వ : మీకు కనపడతాడా ?

వి : నేనెవణ్ణి ?

వ : అదేమండి? యింతమంచి mental powers వున్నపుడు నేనెవణ్ణి అని అడుగుతారేమిటి ? మీరు 'మీరు' అనుకోబట్టికదా మిమ్మల్ని ఆ ప్రశ్న వేస్తుందేది. ఎవర్నంటే వాళ్ళని అడుగుతానా ?

వి : నాక్కనిపించాడా అంటే అమ్మా, నాకిన్నేళ్ళొస్తే మూడు నాలుగుసార్లు ఏదో ఒక మోస్తరుగా కనిపించాడు. ఇందాకా ఆవిడ చెప్పానే కొట్టొచ్చిందని, ఆవిడ కనిపించారు.

ఒకప్పుడు నేను చాల దుఃఖమయమైన శివుణ్ణి భావిస్తూ వుండగా – నాకు నిద్రకాదు, మెలకువకాదు. నాకున్న ఆ దుఃఖమయమైన భావముయొక్క లోతు యింతని చెప్పటానికి వీల్లేదు. మడత మంచంమీద పడుకునివుంటే – ఆయన శివుడని నేననుకున్నాను. ఆయనవచ్చి నాఒళ్ళో కూచున్నాడు. ఏదోఅన్నాడు. ఆ సమయంలో ఆప్రక్కని అమ్మవారు కూర్చుంది. అమ్మవారు అంటే, నాకు తెలిసినంతమటుకు అంత స్త్రీసౌందర్యం మూట కట్టిన మూర్తివుండదు ! ఆయన వచ్చి నన్నేదో ఓదార్చినట్లుగా చేశాడు. ఈ ఒకదర్శనం జరిగిందమ్మా. ఇది భగవంతుడి దర్శనమననా నేను ?

వ : దానివలన మీకు చాలా...

వి : మహానందం కలిగింది. శివుడు కనిపించాడనే అనుకున్నాను. ఒకొక్కప్పుడు ఒకొక్క రీతిగా వుంటుందమ్మా. దానిష్టమొచ్చినప్పుడు వస్తుందమ్మా ఆ revelation. రోజూ నేను జపం చేస్తాను. గంటసేపు జపం చేస్తే నలభై అయిదునిముషాలు, యాభై అయిదు నిముషాలు రేప్పొద్దున డబ్బు ఎట్లా, యిది ఎట్లాగనే వుంటుంది. Inadvertent గా ఒకానొక moment లో నాఒళ్ళు నాకు తెలియదు. ఒక extreme light కనిపిస్తుంది. Terrible light కనిపిస్తుంది. ఒకొక్కప్పుడు ఆ light మీద ఆవరించి సన్నసన్నని కొమ్మలుంటై. నా experience చెప్తున్నా ఒకొక్కప్పుడు– నిన్నా, మొన్నా, సరిగ్గా నిన్నా మొన్నా సంగతే– నాకేదో జబ్బుచేసి విరేచనాలకు మాత్ర వేసుకుంటే పదకొండు గంటలకు విరేచనం వెళ్ళిపోయింది. నా ఒళ్ళు తేలిపోయింది. వెళ్ళిపోతుందేమో ననిపించి అప్పుడు నేనేమి చేశానంటే – నేను ప్రాణాయామాలూ అవీ చేస్తాను– లేచి కూర్చుని ప్రాణాయామం చేస్తున్నాను. చేస్తుంటే, యీ నా body వుందమ్మా, యిక్కడినుంచీ ఆకాశమండలందాకా వుందమ్మా. ఒక తేజస్తంభం, ఒక తేజస్తంభంలా వుంది. I was feeling I was so high and I was nothing but a column of light !

ఇలా అనేకములైన అనుభవాలు నాకు వచ్చినై. మీరడుగుతున్నారుగనక చెప్తున్నాను. ఆ కనపడ్డవాడు శివుడనుకున్నాను.

ఇంకొకానొకప్పుడు ఒక దేవాలయం ప్రక్కన ఒకాయన కూర్చున్నాడు. భగవంతుడు నాకు చాల ఆశలు పెట్టాడు. నేను చచ్చేలోపుగా ఏ ఆశన్నా తీరుస్తాడో, తీర్చడో.

వ : మీ కన్నీ వున్నట్లున్నై గదండీ. ఇంకా ఏమి ఆశలు ?

వి : నా చుట్టూ తుమ్మెదలు మోగుతున్నై. ఆ తుమ్మెదలు మోగటానికి 'ఓం' అని నేను అనుకోవటానికీ అభేదస్థితిగా వుంది. అక్కడ ఒక బ్రాహ్మణుడు కూర్చుని 'నీకు చివరి రోజులలో యీ నాదం నిత్యం వినిపించేట్లుగా చేస్తాను' అన్నాడు. మెళుకువొచ్చింది. ఇది స్వప్నంలోదిగా. మెళుకువొస్తోంటే కూడా నానోటివెంబడి 'ఓ...ం' అని వస్తోంది. అంచేత మెళుకువొచ్చింతర్వాత కూడా ఆస్థితి గనుక దాని కొక యాథార్థ్యం వుండకపోతుందా అని ఆశ. ఇలా కొన్ని experiences వున్నై. దేనికి permanency కనపడలా నాకు. అవన్నీ కూడా, అదేమి చమత్కారమో, ఎప్పుడు తగుల్తుందో నాకు తెలియదు. ఎప్పుడు తగుల్తుందో అన్న ఆశతో మాత్రం జపం చేస్తుంటాను. ఇదేనా position. [సశేషం.]

# గ్రంథసమాలోచన

## మణిప్రవాళము

— సుప్రసన్న.

వాఙ్మయ మొక మహావృక్షము. గద్య పద్య ప్రాచీనార్వాచీనాదిశాఖా వైవిధ్య మున్నను మూలమున మాత్రము కవితై క్యము కలదు. ఇట్టి సర్వసామాన్య మూలము కల వాఙ్మయలతాంత సౌరభప్రక్రియలు బహుముఖీనములు. ఇట్టివానిలో మణిప్రవాళ శైలియొకటి. ఇది బహువిచిత్ర విన్యాసము. ఇది యొక నవీనప్రాయమైన ప్రక్రియ. ఇట్టి ధోరణిలో వచ్చినది మణిప్రవాళము. దీని రచయిత శ్రీ యఱ్ఱోజు మాధవాచార్యులుగారు. దీని వెల మూడు రూపాయలు.

ఇందు సమస్య, ఆమని, కల్యాణ మాధవి, మున్నగు ఖండిక లిరువది యేడు కలవు. కొన్ని పద్యములు మరికొన్ని గేయములు. మరికొన్ని నవీన ధోరణులు. మరి కొన్ని సంస్కృతములు, మరి ఇన్నివిచిత్ర విన్యాసములతో నొప్పుటచేత కాబోలు దీనికి మణిప్రవాళ మని పేరిడిరి. మణులు, ప్రవాళములు దీని యందున్న వని వీరియభిప్రాయముకావచ్చును ఇందలిఖండికలన్నియు నప్పు డప్పు డాయాసందర్భములలో రచింపబడినవి.వీని నిప్పుడొకటిగా కూర్చి మణి ప్రవాళ మని పేరిడి శ్రీనార్ని కేదారేశ్వరుల జన్మదినోత్సవ సందర్భముగా నంకితమిచ్చిరి. దీనికి రచయిత అంకితముగా రచించిన బహుమతి, ఆముఖము, ఆమోదము - [అభిప్రాయము] కలవు. ఇది సుమారేబది యైదు పేజీలగ్రంథము.

ఇందలి రచన నిరాఘాటముగా సహజ మనోహరముగా నడచినది. ఇందలి ఖండికలు మనదేశమున నాయాసందర్భములను స్మృతికి దెచ్చును. శ్రీమాధవాచార్యుల వారి సమ్యగ్దృష్టి, చేయి తిరిగినతనము, లోకజ్ఞత, ప్రస్ఫుట మగును.

సాహిత్యాది కాభ్యర్థనోత్తేజస్సీమలు' (బహుమతిలో నైదవ పద్యములోనిది) క్రీగీటు పదము విచారణీయము.' 'ఎవ్వడో క్కడో వాని విజ్ఞులు బహువిధమ్ములనుతి యొనర్తురో, ఏమహాత్ముడు ప్రణవరూపుడో వాని బ్రార్థింతున్' (సమస్య 2) ఇట 'వాని' చోట 'వేని' యనుట బాగుండు నేమో? 'ఆంధ్రోహం' లోని 'స్వస్థాన స్వాధీన ప్రస్థాన పరాఙ్ముఖాతి శిథిలోహం శిథిలోహం, దీని యర్థము విచారణీయము. మరియు నిందే 'ఆంధ్రత్వ వినా సమస్తనీరంధ్ర వ్యాప్తసత్వ తేజోహం' ఇదియు నిట్టిదే. జయాంధ్రలో 'రాజేంద్ర కృష్ణరాడ్రాజప్రముఖులెల్ల' ఇట క్రీగీటు పదము వినరాకుండుటయేకాక రాట్ తరువాతి రాజపదము ఛందోబందోబస్తుగా నున్నది. శ్రీరామాయనమః లోని రెండవ పద్యములోని 'మహిమావిభవాతిశయ' ఇందు మహిమాపదము విచారణీయము. స్వప్నాభిషేకము లోని 'కళలలో వైద్యుతపు కాంతు లుమిసినయట్లు, కళల సౌదామినీ కాంతు లొరసినయట్లు' ఇందు క్రీగీటు పదములు సమానార్థకములేకదా! వెంట వెంటనే పునరావృత్తి యెందుకు? నాపశిలక, యువతీ భోగ (ఏటుకూరి కవిబ్రహ్మ) సమాసవైచిత్ర్యము, చలన వాక్చిత్ర శిల్పకౌశలము జూపి' సమాసార్థములు విచారణీయములు. అక్కినేని నటసమ్రాట్ లో 'సుస్వాగతమ్ము' స్వాగత సుస్వాగతములకు గల భేదము పాటింపబడలేదు. ఇందే 'మహాస్స్వరాట్' విచారణీయము. హితోపదేశములో 'ప్రాంశులభ్య ఫలాశ నుద్బాహులైనవామనుని వోలె' విశేషణ విశేష్యముల భిన్నవచనత్వము ముద్రణ స్ఖాలిత్యమైయుండును.

ఇట్టి పటనట మున్నను శ్రీమాధవాచార్యులుగారి పరిణతి, నేర్పు పదవిన్యాసము, భావగాంభీర్య వైశిష్ట్యములు పాఠకుల నాకట్టుకొను ననుటలో సందేహము లేదు. వీరు మరిన్ని రచనలు చేసి యాంధ్ర పాఠకుల నానందింప జేయగల సంపూర్ణమైన యర్హత గలవారు.

—...—

## రచయితలకు

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతిదీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు వీలైనంతవఱకు ప్రయత్నింపఁ బ్రార్థన.

నవంబరు 1 వ తేదీని వార్షిక సంచిక ప్రచురింపదలచితిమి. వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్యమిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింప గోరిక,

– సంపాదకులు.

( 14 వ పేజీ తరువాయి )

ఉదాహరణలు చూపవచ్చు ... "రైతులారా ! రాజకీయ వర్షం పడుతోంది. మోసపోయి మీ విత్తనాలు చల్లకండి" (పు. 56)

"నమ్మండి మనిషి బాధని తొడలమీద వేసుకుని పొట్టచీల్చే రోజు వస్తుంది గొరిల్లా ఐ !" (పు. 58) ఇక్కడ నరసింహావతార స్ఫురణ స్పష్టమవుతుంది. బాధ హిరణ్యకశిపునివలె మనిషిని బాధిస్తోంది. అప్పుడు నరహరి అవతరిస్తాడు. ఉత్త అచేతనమైన స్తంభంవంటి జడపదార్థం నుంచే ఆవిర్భవిస్తాడు. మనిషిని సంపూర్ణ ప్రహ్లాదునిగా మారుస్తాడు. ఇలాంటి పురాణగాథల స్ఫురణ (allegory) ఎన్నో చోట్ల దర్శనమిస్తుంది.

"రూపాయి నలిపి వాసన చూపితే ఆపాతంగా అలా మూర్ఛపోతే ఎలా ? కొత్తయుగపు తొడనుంచి చీల్చినకండతో నిర్మించిన గరుడుడివికావాలి!...' (పు. 60) అన్నపుడు గరుడుడికథ జ్ఞాపకం వస్తుంది. ఒకవేళ రాదుపో-'రూపాయి నలిపి వాసనచూపితే'-మాత్రం మనసుని విడువదు. జ్ఞాపకాలను వేధస్తూఉంటుంది.

మానవునిలో నిద్రాణమై ఉన్న అజ్ఞాత తేజస్కం ఈ గొరిల్లా! ఇదెక్కడినుంచో రావలసిన పరదేశి గాదు. అంతర్నాళాల లోనిది. ఆది ఎప్పుడో హఠాజ్జటిలధ్వానంతో ఉదయిస్తుంది. నిరాఘాట పవన ధాటివలె విజృంభిస్తుంది. సమరస మహాకారంతో లోకాన్ని జయిస్తుంది. హేమాంచల రోచమాన కాచ నేత్రత్రయితో దర్శన మిస్తుంది. ఆ విశ్వరూపసాక్షాత్కారంకోసమే కవిఆరాటం!అదే ఈ గొరిల్లా కావ్యం! అంతవరకూ కావ్యగత దాహంతో అతృప్తుడైన కవి ఆందోళన చెందక తప్పదు. అంతమాత్రాన ఎవరుగాని శమాన్వితసముత్సాహాన్ని కోల్పోనవసరమూలేదు' అ ప్రబోధ మందిస్తున్నది కనకనే ఈ కావ్యం అస్మదాదులకు మాననీయ మవుతోంది.

( సశేషము )

# ఈపక్షంలో

## ఉపాధ్యాయ సంక్షేమ దినోత్సవము :-

ఈ పక్షములో సెప్టెంబరు 5వ తేదీని తత్త్వవేత్త, మాజీ భారతప్రభుత్వాధ్యక్షుడు సర్. యస్. రాధాకృష్ణ జన్మదినోత్సవ సందర్భమున దేశవ్యాప్తముగా ఉపాధ్యాయ సంక్షేమ దినోత్సవములు జరిగినవి. కొంద ఱుపాధ్యాయులకు సన్మానములును జరిగినవి. సమాజములోని లక్షలకొలది ఉపాధ్యాయులలో చాలా కొలదిమందికి ఆదర్శ ఉపాధ్యాయులను పేరుతో జరపబడిన ఈ సన్మానములు సముద్రములో నీటిబొట్టే అయినప్పటికి ఉపాధ్యాయులకు గౌరవ మీయవలయు ననెడి ఆకాంక్ష మెచ్చదగినది. ఉపాధ్యాయుల జీతములు పెన్షను వగైరా సదుపాయములు సకాలములో అందునట్లు చేయుటే వారిపట్ల మహాగౌరవము చూపుట యని తదధికారులు గ్రహించుట మిక్కిలి అవసరము. నిజమైన ఉపాధ్యాయులుగా తమ్ము నిరూపించుకొనవలసిన బాధ్యత ఉపాధ్యాయులపైనున్నది. ఇందుల కీయుత్సవములు దోహదము చేసినపుడే వాని సార్థకత.

## వార్షికోత్సవం :-

సెప్టెంబరు మూడవతేదీని రాజమండ్రి సీతంపేట ఉపగ్రంథాలయములో రామన్ స్టడీ సర్కిలువారి వార్షికోత్సవము శ్రీ పోతుల వీరభద్రరావు గారి అధ్యక్షతను జరిగినది. ఆ సందర్భంలో కవిశేఖరులైన శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి సన్మానము జరగినది. శ్రీ సత్యనారాయణ శాస్త్రి, డాక్టరు రామకృష్ణ, శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యం, శ్రీ బులుసు సీతారామ శాస్త్రి, శ్రీ శ్రీకాకోళపు సత్యానందం, శ్రీ భాను, శ్రీమతి కోడూరి లీలావతి, శ్రీ ఆకుమిల్లి రంగారావు ప్రభృతులు సందేశము లొసగుచు ఒక్క సంవత్సరములో పై సంస్థవారు అనేక సాంస్కృతిక, సామాజిక కార్యక్రమములు జరపగలిగినందులకు ప్రశంసించిరి.

## సాహిత్యసభ :-

సెప్టెంబరు 20వ తేదీ ఆదివారం సాయంకాలం 6 గంటలకు రాజమండ్రి హుమారుక్లబ్బు వారి యాజమాన్యమున అల్యూమినియం అసోసియేషను హాలులో శ్రీ బులుసు సీతారామశాస్త్రి అధ్యక్షతను సాహిత్యసభ జరగినది. ప్రసిద్ధ విద్వాంసులు శ్రీ మల్లంపల్లి దుర్గాప్రసాద్ కాళిదాస శాకుంతల విశేషములపై ప్రసంగించిరి. చతుర్థాంక, శ్లోక చతుష్టయములతో సమానముగానూ మించీ కూడా గ్రంథమంతా ఔచితీ రస పరిపుష్టమై కాళిదాస ప్రతిభను వెల్లడించుచున్నదని అనేకములగు ఉదాహరణములతో వివరించిరి. జాతిరత్నము సానపెట్టినకొలది కాంతులను విరజిమ్ముట సహజమేకదా.

# శ్రీమద్భగవద్గీత - అనుబంధము

( ఆంధ్ర తాత్పర్య వివరణ సహితము )

(20 వ సంచిక తరువాయి) వివరణకర్త : శ్రీ కె. ఎల్. నారాయణ.

### అ. 11 శ్లో 31 ఎ

శ్రీ భగవానువాచ-

నారాయణోహం పురుషః శివోహం
బ్రహ్మాహమాస్మి సకలోహమస్మి
పూర్ణోఽహమీశశ్చ పురాతనోహం
హిరణ్మయో జ్ఞాన రూపోఽహమస్మి

శ్రీకృష్ణభగవానుడు పల్కెను —

నేనే సకల జీవులకు ఆశ్రయ భూతుడనైన నారాయణుడను; పరమ పురుషుడను, లయకారకుడైన శివుడను, సృష్టికర్తయైన బ్రహ్మను; సకల జగత్తును నేనే; పరిపూర్ణుడను, సర్వనియంతను, అనాదిసిద్ధుడను, హిరణ్మయుడను, జ్ఞాన స్వరూపుడను అయి యున్నాను.

### అ. 11 శ్లో 39

వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితా మహశ్చ
అనాదిమా నప్రతిమ ప్రభావః
సర్వేశ్వరః సర్వమహో విభూతే

ఓ సకల విభూతినాథా! వాయు దేవుడు, యముడు, వరుణుడు, చంద్రుడు, కశ్యపాది ప్రజాపతులు నీవే; పితామహుడగు బ్రహ్మదేవునికి తండ్రి వగుటచే ప్రపితామహుడవు; మొదలు లేనివాడవు; సాటిలేని ప్రభావము గలవాడవు; సర్వేశ్వరుడవు.

### అ. 11 శ్లో॥ 39 A

నమో నమస్తే ఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమోనమస్తే
నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ

నీకు అనేక నమస్కారములు. మరల మరల నమస్కరించుచున్నాను. ఓ సర్వస్వరూపా! నీకు తూర్పుదిక్కున నమస్కారము; వెనుక దిక్కున నమస్కారము; అన్ని దిక్కులయందు నమస్కారము.

### అ. 11 శ్లో 40

న హి త్వదన్యః కశ్చి దస్తీహ దేవ
లోకత్రయే దృశ్యతేఽచింత్యకర్మ
అనన్త వీర్యామిత విక్రమ స్త్వం
వ్యాప్నోషి సర్వం చ తతోఽసి సర్వః

ఓ దేవా! ఊహాతీతమైన చేష్టలు గల వాడా! నీకంటె వేరైనవాడీలోకమున లేడు; ఈలోకముననే కాదు ముల్లోకములలోను గానరాడు. నీవు అనంత బలము, అమిత పరాక్రమము, గలవాడవు; అంతటను వ్యాపించి యుంటివి. అందువలన సర్వస్వరూపుడవై యున్నావు.

### అ. 11 శ్లో 44 ఎ

దివ్యాని కర్మాణి త వాద్భుతాని
పూర్వాణి పూర్వా ఋషయః స్మరన్తి
నాన్యోస్తి కర్తా జగత స్త్వ మేకో
ధాతా విధాతా చ విభు ర్భవశ్చ

నీ చేష్టలు దివ్యములు, విస్మయకరములు. అట్టి నీపురాకృత కర్మలు ప్రాచీన ఋషిపుంగవులు స్మరింతురు. ఈ జగత్సృష్టికి నీవొక్కడవు దక్క వేరొండుకర్త లేడు. జగత్తును ధరించువాడవు; జీవులకు కర్మఫలములను పంచియిచ్చువాడవు; జగద్విభుడవు; సర్వవ్యాపివైన జగత్స్రష్టవు.

### అ. 11 శ్లో. 44 B

త వాద్భుతం కిం ను భవే దసహ్యం
కిం వా శక్యం పరతః కీర్తయిష్యే
కర్తాసి సర్వస్య యతః స్వయం వై
విభో తతః సర్వ మిదం త్వమేవ

నీకు విస్మయకారణముగాని దుస్సహమైనదిగాని యేమున్నది? నిన్ను కీర్తించుటకంటె చేయగలిగిన దేమున్నది? ఈ జగత్తంతయు నీవు స్వయముగా సృష్టించుటచే, ఓ విభూ! ఇదంతయు నీవే!

### అ. 11 శ్లో. 44 C

అత్యద్భుతం కర్మ న దుష్కరం తే
కర్మోపమానం న హి విద్యతే తే
న తే గుణానాం పరిమాణ మస్తి
న తేజసో నాపి బలస్య నర్ధేః

అతి విస్మయకారణమైన కర్మయైనప్పటికి అది నీకు దుష్కరము గాదు. నీవు చేయు పనులకు సాటిలేదు. నీ గుణములకు, తేజస్సుకు, బలమునకు, సమృద్ధికి అవధి లేదు.

### అ. 13 శ్లో. 0 A

అర్జున ఉవాచ —

ప్రకృతిం పురుషం చైవ
క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం
జ్ఞేయం చ కేశవ!

అర్జునుడు పల్కెను —

ప్రకృతి పురుషులు క్షేత్ర క్షేత్రజ్ఞులు, జ్ఞానజ్ఞేయములు అను నీ విషయములను తెలియగోరుచున్నాను.

### అ. 13 శ్లో. 0 B

శ్రీ భగవానువాచ —

ప్రకృతిం పురుషం చైవ
క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ
ఏత త్తే కథయిష్యామి జ్ఞానం
జ్ఞేయం చ భారత!

శ్రీకృష్ణభగవానుడు పల్కెను —

అర్జునా!

ప్రకృతి పురుషులు, క్షేత్రక్షేత్రజ్ఞులు, జ్ఞానజ్ఞేయములు అను నీ విషయములు చెప్పెదను.

# నేను

– శ్రీ ప్రసాద్.

నిబిడ నీరవ తామసీ నిశను బుద్ధి
నూతగాగొని దిఙ్మోహ ముబుకు మనసు
నదిమి దెసల నీక్షించియు నంధకార
బంధు వగుచును నిలిచితి బాటయందు'

దిక్కుమాలిన భీతి యధిక మగుచును
మనవి నాక్రమింప, స్పర్శ మరువని పద
యుగళితోడుగా, నిలుపని యూహ నిలువ
మిన్ను జూచినఁదోచేఁ భ్రామినుకు మినుకు'

చేతు లెత్తి యందగరాక చిగురు దొడుగు
చిత్తలత కాశపుష్పమై చిత్ర, దీప్తి
మరల నిండించె మధువు నామనసునందు॥

చెవుల ఝుంఝులు ఝువ్వనఁ జేరవచ్చె
జిహ్వమను చినుకుల ధాటి శీర్ణమైన
దేహయష్టిక స్థాణుత్వ దీప్తి వదలె
కనులు చినుకుల తళుకుల గానలేవు॥

దూరమైన 'నేను' మరల తోడువచ్చె
పూర్వ పశ్చిమ బుద్ధి యపూర్వ మయ్యె
దక్షిణోత్తరా జిజ్ఞాస దవ్వుచనియె
కాందిశీకత్వ మేపార గ్రమ్మికొనియె॥

'నేను' తన్ను మరచియె తా నిల్చియుండె
విషయ నిఘ్నమైన మనము భీతి నందె
పదము పథము నెరుగకయె పారజొచ్చె
తుదకు జీర్ణ వలభి జేరి తొలగి నిలిచె॥

'నేను' పాంచభౌతిక స్థితి నిష్ఠమయ్యె
పదము పథము వీడి యెటకో పరువులెత్తి
కడిది దూరము రెంటికి గాన వచ్చె
'నేను' ఏకాంత కాంతమై నిలచి యుండె॥

జీర్ణవలభికానత పిశాచికత లెన్నొ
పాంచభౌతిక సంయోగ పంక్తు లెన్నొ
భూత పంచక పంచత్వ బుద్ధు లెన్నొ॥
నేను నాదను పసలేని నిష్ఠ లెన్నొ॥

# తెలంగాణ మధ్యాక్కరలు

– 'కవిగణపతి'

నా తెలంగాణ కావ్యాంగనామ ఖాంచత్కాకమూర్తి
నా తెలంగాణ శృంగార నాళీక మకరందవర్తి
నా తెలంగాణ విజ్ఞాన నందనోద్యాన సూనమ్ము
నా తెలంగాణ భూలోకనాకమ్ము నాదు ప్రాణమ్ము.

ధీరగంభీర సుస్మేర దివ్యాంగి నా తెలంగాణ
సారసంపత్సుఖాధారశ్యామాంగి నా తెలంగాణ
చారు గోదావరీ స్నాతసన్మాత నా తెలంగాణ
వీరశూరాత్మజోపేత విఖ్యాత నా తెలంగాణ

# సాంధ్యము

– తంగుడిగ శ్రీధరరావు, బి.ఏ.బి.ఓ.ఎల్.

వీడనుపో నిన్నన్నదు వీడకు మీ నన్నన్నదు...
నీకెయ్యది సంబంధం బదియే అగు నాబంధము –
నీసూర్యుడు నీచంద్రుడు నెనసి మెరయు నీతారలు
నీనదులును నీ భూరుహములు భూధరజలదమ్ములు

నాజీవన నందనవన నవశోభల హేతువు అగు –
నీ శారద చంద్రిక లిల సుఖస్వర్గము సృష్టించుచు
నాజీవన జడనిధికే నవోత్సాహమ్ము గూర్చు
నాజీవన హేమమునకు పరిమళమ్ము పట్టించును
సాంధ్యమ్మున ఉదయించెద నవోదయ రాగరేఖ ?
సాంధ్యజ్ఞానమునందు జ్ఞానోదయమగుచుండదె ?
నీయందున పరమాత్మను దర్శించుటె నా ధ్యేయము.

---

ఇన్ని యని చెప్పగారాని యెంతయైన
నేను వీడదు పొందదు నిక్క మంచు
నేర్పు మీర బలుకు కుల్క నేను ఎవరొ
'నేను' లెన్నొ తత్త్వ మదేమొ? నేను నేనె
వ్యత్యయంబున నూనెయు నగదు నేను.

# ప్రగీతరగతి క్రొత్త పుస్తకాలు

## 1978 - 79 నోట్సు

### 1st YEAR

| | | | | |
|---|---|---|---|---|
| * 1 | ఖడ్గనారాయణము | బి. ఏ. | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| * 2 | సాహితీ సాక్షాత్కారము | ,, | ప్రోజు | 3 — 50 |
| * 3 | మహాసేనాని | ,, | నాన్ డిటైల్డు | 2 — 75 |
| * 4 | షట్పది | బి. కాం | పోయిజు | 7 — 00 |
| * 5 | నాయకరాజపర్వము | ,, | మోడరన్ పొయెట్రీ | |
| * 6 | రమణీ ప్రియదూతిక | ,, | నాన్ డిటైల్డు | 2 — 75 |
| * 7 | ఆంధ్రప్రశస్తి | బి. ఎస్. సి. | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| * 8 | మన సంస్కృతి - మన సాహితి | ,, | ప్రోజు | 3 — 50 |

### 2nd YEAR

| | | | | |
|---|---|---|---|---|
| * 9 | సావిత్ర్యుపాఖ్యానము | బి. ఏ. | ఓల్డు పొయెట్రీ With TEXT | 4 — 00 |
| *10 | స్వప్నవాసవదత్తము | ,, | క్లాసికల్ డ్రామా | 6 — 00 |
| *11 | సుభద్ర | ,, | మోడరన్ డ్రామా | |
| *12 | ఖడ్గనారాయణము Same as 1 Year | ,, | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| *13 | సౌపర్ణోపాఖ్యానము | బి. కాం | ఓల్డు పొయెట్రీ With TEXT | 7 — 00 |
| *14 | నాయకరాజ పర్వము Same as I Year | ,, | మోడరన్ పోయెట్రీ | |
| *15 | ప్రతిమ | ,, | క్లాసికల్ డ్రామా | 3 — 00 |
| *16 | బలరామ విజయము | ,, | మోడరన్ డ్రామా | 3 — 00 |

* పై పుస్తకములన్నీ ముద్రణ పూర్తియై కాపీలు సిద్ధముగానున్నవి. X క్లాస్, ఇంటర్ తెలుగునోట్సు కూడ అన్నీ సిద్ధముగానున్నవి. కొన్నిరకముల స్టాకు తక్కువగా నున్నది. త్వరపడుట మంచిది.

**వి. పి. అండ్ కో.,**
6 - 8 - 7, ఇన్నీసుపేట
రాజమండ్రి - 1

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.